శ్రీరస్తు

# మనోమందిరము

అను పద్యకావ్యము



★

శ్రీమతి మణిరామచంద్రరావుగారిచే

రచియింపఁబడి

మామగారికిని, తండ్రిగారికిని

అంకిత మియ్యఁబడినది.

శాలి. శక. 1881 వికారి సంవత్సర ఆషాఢ శుద్ధ ఏకాదశి

గురువారము

16-7-1959

# తొలిపలుకు



మణిమందిరము అనగా మణియమ్మ నివసించు గృహమని యర్థము. అట్టిమణిమందిరానికి శ్రీ మహావిష్ణువును అతిథిగా పిల్చుటే కథానుక్రమము ఆ ప్రభువు సమస్త దేవతాబృందముతో కదలిరాగ. నాభారతి జనులకు చూపుటే. నాయభిలాష ఈధైర్యమునకు నా అయిదేండ్ల బాల్యదశలో చూచిన శ్రీ మహావిష్ణు దర్శనమున్నూ, స్వప్నానుభవములున్ను తోడ్పడినవి. భాషాజ్ఞానములేనందు వలన నెన్నియో భావములు జీర్ణించిపోయినవి. మాటలవచ్చుచున్నబిడ్డ మధ్యమధ్య వదరివైచిన వచనములకు ప్రీతితో పెద్దవారు పూర్తియర్థము గ్రహించురీతి పండితవర్యులు నాభావములను పూర్తిగా అర్థముచేసి కొనగలరని ఆశిస్తున్నాను. మణిభావమణులు అను గ్రంథముయొక్క ఆవిష్కరణ సందర్భములో కవులు పాఠకులు నాకిచ్చిన ప్రోత్సాహమే యింత త్వరలో ఈకావ్యము చేయుటకు తోడ్పడినది. మరల అట్టిప్రోత్సాహమే నాకు లభించగలదని ఆశించుచు మీదీవనలఁ గోరు, అల్పభావాల

(ఆంధ్రసోదరి)

మణియమ్మ.

# విజ్ఞాపన

పండితవర్యులకు సమస్కరించి, అల్పభావాల ఆంధ్రసోదరి మణియమ్మచేయు విజ్ఞప్తి భాషలోనేమాత్రము కృషిసల్పనినాకు, కేవల దైవికముగా కలిగిన, కవితానాహిని, కట్టజాలక వ్రాసెడు ఈ చిన్న మాటలలోదోషములున్న, తమ విజ్ఞానముతో సరిదిద్దుకొని, మెఱుగును పెట్ట గలరనియు, తమభావములు వ్రాసి ఈ మణిమందిరమను చిన్నగృహమును పెద్దసౌధముగా, అనగా (మణిమందిరమను చిన్నపొత్తమును మహాకావ్యముగా భావించగలరనియు) మీవిజ్ఞానవాక్కులతో దీవించగలరనే కోరికతో ఇందలిబాధ్యత కవివర్యులకే వదలివేయుచున్నాను. నాపుట్టుక స్థలము తూర్పుగోదావరి జిల్లాలో రాజమహేంద్రవరము గాన నచ్చటి వాడుకభాష దీనియందెక్కువ కానుపించును. మీభాషాజ్ఞానము ముందు ఓనమాలను బోలు ఈ చిన్న పదములను చూచి హేళనచేయక చంటి బిడ్డ మాటలుగా నెంచిక్షమించఁగలందులకు వేడుచున్నాను

ఇట్లు
ఎల్లప్పుడు మీదీవనలకోరు,
అల్పభావాల ఆంధ్రసోదరి
మణియమ్మ.

# పండితాభిప్రాయములు

ఆస్థానకవి బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

శ్రీరస్తు.

## "మణిమందిరము"

★

ఇది మణియమ్మ వ్రాసి తన తండ్రిగారికిని మామగారికినిఁ గృతియిచ్చిన గ్రంథమణి—"అల్పభావాల ఆంధ్రసోదరి మణియమ్మ" అని తొలిపలుకులో నామె వ్రాసికొనినది. గాని నాకమాత్రమట్లు కానిపించుటలేదు. మహాభావములెన్నో యిందు కానవచ్చుచున్నవి. "రమ్మురమ్మయ్య మణిమందిరానికనిన పలుకవేలయ్య? పరమాత్మ! పంతమేల?" అను మకుటముతో నానావిధములైన చక్కని భావములతో గ్రంథమంతయు వింతగా సాగించినది. అల్పభావములుగలదాననని వ్రాసికొనుట అహంభావనిరాకరణమే యనుట నిశ్చయము.

పూర్వకవులు తమగ్రంథములలో దేవుఁడు స్వప్నదర్శనమిచ్చి గ్రంథము కృతియిమ్మనినట్లు వ్రాయుట సత్యదూరమందురు. వారిమెస్వప్న వృత్తాంతములు విన్నచో నన్నియు నిజములేయని తోఁచకమానదు. ఈమె బాల్య

ముందుఁ దనతండ్రిపట్లఁ దానుజూపిన భావాతిశయము వర్ణనాతీతము విజ్ఞానప్రదుఁడుతండ్రి గావున నిటఁదల్లింబేర్కొనమి దోషమునాఁబడదు. తనకు స్వప్నానుభవమున నైనభావములు భాషాజ్ఞానము లేనందున జీర్ణించిపోయినవని చెప్పుచు వానిని మాటలు నేర్చుచున్న బిడ్డ నడుమ నడుమ విడిచిన పదములఁ బెద్దలు ప్రీతితో బూర్తియర్థము గ్రహించినట్లు పండితవర్యులు నాభావములను బూర్తిగా నర్థముచేసికొనఁ గలరని యూహించుచున్నాను. అనిచెప్పిన వాక్యమెంత గంభీరముగానున్నదో చిత్తగింపుడు.

ఈమె లోగడ "మణిభావమణులు అను గ్రంథము వ్రాసెనట! దానిపేరుంబట్టియె యది మణియని తెలయు చున్నది. ఇట్టినామములు తమ గ్రంథములకుం బెట్టియే మహాకవులు తమ మేధాశక్తిని బ్రకటించుకొందురు. మఱియు నీసతి తనబుట్టుక రాజమహేంద్రవరమున ననియు అక్కడి వాడుకభాష నాభాష యనియు, ఓనమాలంబోలు నాయీ చిన్ని పదములంజూచి హేళనముచేయక చంటిబిడ్డమాటలుగానెంచి క్షమింపువేడుచున్నా"ననియె. ఇందు రాజమహేంద్రవరభాషయనియు, ఓనమాలవంటి నామాటలను టలో నెంతభావగాంభీర్యములున్ననో పండితులు గ్రహింపఁ

గలరు. రాజమహేంద్రవరమే భాషకుఁ బుట్టినిల్లు, ఓనమాలకే భక్తపండితలోకము బహువిధములఁ బాటుపడుచున్నదని తెలుపుచున్నాను.

ఈమె గ్రంథాదిని సరస్వతిస్తుతి చేసినది "రాత్రి మాయమ్మనుబోలి వచ్చితివి, ఎందుఁబోయితివి. నిన్నుఁ గని పెట్టుటకు నేను బమ్మెరపోతరాజునా? అన్నదహః! "తోడ బుట్టువు చందానఁ దోడనున్న గణపతయ్యకు నేనిప్డు గారెలిడుదు" ఇది గణపతిస్తుతి గారెలు తినుటకు తప్పకవచ్చునని యే నామతి. ఓహో! కవులారా! మీరుగాని మీపూర్వులుగాని గణపతికిట్లు గారెలుపెట్టినారా? లేదు లేదు. ఇది యేక్రొత్త పోకడ!! మఱియును దేవతాస్తుతులన్నియు నేదో యొక క్రొత్తతనమును బోధించుచునేయున్నవి. చూడుడు చంద్ర వర్ణనము.

> "బాలమనసుల నవ్వించుభాగ్యరాశి
> భువిని వెన్నెలఁ గాయించు పుణ్యమూర్తి
> మామలకుఁ దాతతండ్రులమామయైన
> చందమామకుఁ గేల్మోడ్తు సంతసమున"

"బాలమనసుల నవ్వించు" అనఁగా తల్లి తన పిల్లనెత్తుకొని దానికిఁ జందమామను జూపుచూ, చందమామ రావే! జాబిల్లిరావే! బువ్వఁదినిపోవే! ఇత్యాదులు పలికి

పిల్లను నవ్వించి చూపింతు రీవిషయమిట సూచితము లోకమున కంతకును మామ (పోషకుఁడు) గావునఁ జందమామ యని ముద్దులొలుకు సుద్ది. యిద్ది కాదందురా? ఎవ్వరనఁ గలరు? చెంచువాండ్రులోనగు నాటవికులు భర్తను మామ యందురు. ఇఁక రాజమహేంద్రవర వర్ణనము చూతుము.

రంగైన బంగారు రాజమండ్రి
రత్నాలపేటిక రాజమండ్రి
రమ్యరత్నాలుగలకొండ రాజమండ్రి

ఈ పదములెంతో ముద్దులుమూట గట్టుచున్నవి. ఈమె తన వంశమంతయు నొక్కపద్యమున తాత తాత మొదలుకొని తనవరకుం జెప్పినది. ఇట్టు చెప్పుట యసామాన్యమే. ఈలోఁద నతండ్రినెట్లు సంబోధించుచు నెట్లు రంజనచేసినదో! చదువుఁ డామోదజనకంబగు.

1 చందమామయ్యకథనాకుఁ జక్క చెప్పు
కన్నతండ్రికి నేనెప్డు కరము మోడ్తు
2 చుక్కలెప్పుడు పుట్టెనో సూర్యుఁడెట్లు
కొండమీదికి నెక్కెనో గోటుగాను
3 దేవుఁడెట్టులు పుట్టించె దేశమంత

4 భుజమునందు నన్నిడికొని బుజ్జగించి
భాగవతపద్యరత్నాలు పఠనచేసి
జోలపాడంగ నాకప్డు జోగురాఁగ
నిదురఁబుచ్చెడు నాన్నకే నిడుదునతులు॥

5 కాసులప్పుణ్ణి నాన్న! ఓకన్ననాన్న
చేతనెత్తెడు నాన్నకే జేజెలిడుదు॥

ఇట్లుముద్దులుమూటగట్టునట్లు తనకు నాన్నకుంగల ప్రేముడి కరుణారసంబు వెల్లివిరియుచున్నట్లు పెక్కుపద్యములు, పెక్కువిషయములం జేర్కొనుచు నిందువర్ణింపఁబడినవి. అవి చదువువారి కానందబాష్పములు రాలకమానవు మఱియు తన బాల్యమెట్లు నడచినదో 30 దవ పద్యమందు చెప్పబడినది అదియొక్కటిచాలు నీమెపేర్మిం జేర్కొనుటకు తార్కాణ మగుచుండు, 63 వ పద్యములో తండ్రిగారు తనకుఁ జెప్పిన కథలన్నియు నెనోన్న తెన్నుల విన్నవించుట కెన్నవచ్చునని చెప్పుచున్నాను. మఱియు ననేకవిషయము లీ గ్రంథమందును పోద్ఘాతముగా మునుమున్న విన్నవించినది. ఇట్లు సామాన్యముగాఁ గవులు వ్రాయరు. ఈవ్రాత బంగారుపూఁతయై గ్రంథమునకు మెఱుఁగు దెచ్చినది. తన మామగారినిందుఁ జేర్కొనుచు చెప్పిన 44 వ పద్యము హృద్యమందునో? జగదేకవేద్యమందునో? చెప్పఁజాల.

ఈమణిమందిర గ్రంథమునందు రమ్మురమ్మయ్య మణి మందిరాని కన్న మనుటముతో సీసీసపద్యములు హృద్యములుగాఁ జెప్పఁబడినవి. ప్రతిపద్యమందు నేదోయొక యపూర్వార్థమద్భుతముగాఁ జేర్కొనబడుచున్నది. కథలో 7 వ పద్యమున సంసారమను నెద్దుబండినెక్కి బాటసారినై పోవుచుండఁగా క్రోధమను కోలుపులివచ్చి కాంద్రుమనుచు సహనమను నాబండియెద్దును జంపఁజూడగా ఆయుధములు లేని దాన దానింగాపాడుటెట్లని కలఁతపడుచుఁ గరుణింప రమ్మని నిన్నుఁ బ్రార్థింతు రమ్మురమ్మయ్య" ఇట్లు 100 పద్యములు నేదో విశేష విషయముల వెల్లడించుచునే యున్నవి. మఱియు రెండు, మూడు పద్యములు 87 వ పద్యము "దేవుండవీవని కావరమ్మని పిలుచుటలేదు భారత స్త్రీలకుఁ బతియెదైవముగాని యితరములమాట యేమిటికి? నిన్ను దైవముగాఁ గాక తండ్రిగాఁ బిల్తును. నన్ను తనయగా నెంచిరమ్ము అనివ్రాయుట. యెంత విజ్ఞానమో పెద్దలూహింతురుగాక.

90 వ పద్యము "మజ్జిగలో వెన్నయుంటనట్లు సంసారముందున్న దాననేను" కట్టెలో నగ్ని కానఁ బడకుండునట్లు కాలంబు గడపుచుంటిని కులాలకీట న్యాయమున కుమారీ తక్ర నవనీతన్యాయము. కట్టెలో నగ్నియు నట్టిదే.

91 వ పద్యము భారతదేశములో భాగ్యవంతులు బిరుదు బంటులు వేనవేలు వేదవేత్తలు పండిత ప్రకాండు లుండఁగా వీరిలో నల్పురాలనైన యింతిని నేను నాయింటిలో బనిచేయ నీకు జన్నతనమా? నీవు భక్తికి లొంగెడు బంధువైనచో రమ్మురమ్మయ్యా! ఇట్లు గ్రంధమంతయు వ్రాయుటకు పండితులకుగాని సామాన్యులకు సాధ్యముకాదు. సామాన్య విద్యనేర్చిన యొకస్త్రీ ఇట్లువ్రాసినదనుచో నామెపూర్వజన్మ పుణ్యావాసన మంచిదనియు నామెకు స్వప్నద్వారమున నీశ్వర సాక్షాత్కారమగుచుండునని చెప్పనగుచున్నది.

ఇట్లు గొప్పవిశేష విశిష్టమైన యీ గ్రంథము చదివి నప్పుడు నాకు పరమానంద మధికమగుటంజేసి యిందునేవేని శబ్దార్థదోషములున్నవో లేవో విచారించుట కిష్టత లేక పోయినది. ఏవేని స్వల్పదోషములున్నచో చదువరులే సవరించుకొనవచ్చును. ఈగ్రంథమందవి చెఱకు నకు వంక యెంతదోషమగునో అట్లేయై పరిగణింపఁబడవని నాయభిప్రాయము పాఠకులెల్లరును దీనికిఁ బ్రాశస్త్యము గలిగించఁ గలుగుదురనియే నాయాశయము ఇట్టిగ్రంథము రచియించిన యిక్కవయిత్రీ మణికాయురారోగ్య భాగ్యసౌభాగ్యంబులు పరమేశ్వరుఁడు ప్రసాదించుగాకయని సర్వదా ప్రార్థించుచున్నాను.

రాజమంద్రి
20—6—59

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.
రాజమండ్రి ఆస్థానకవి

## గీతాపండిట్ వేదాంతవిశారద,
## ఉ. వే. శ్రీమాన్ కొంపూరు కృష్ణమాచార్యులు

శ్రీమతి మణిరామచంద్రరావు. అను నీకవయిత్రీరత్నమునకు పూర్వపుణ్యవశమున బాల్యమాదిగా దేవతా పరిచయము దేవతాసాక్షాత్కారము స్వప్నానుభవములున్నట్లు ఈమణిమందిర పద్యములె తెలుపుచున్నవి. ఆచనవుచేతనే "తోడఁబుట్టువు చందానఁ దోడనున్న గణపతయ్యకు నేనిప్పుగారెలిడుదు" ఇట్టిహాస్యోక్తులతో నిందాస్తుతులతో దేవతాస్తుతులు మొదలు కావ్యమున నక్కడక్కడ కొన్ని విషయములు వర్ణింపఁబడినవి. ఇట్లె లక్ష్మీ సరస్వతుల యెడ న్యాయ నిష్ఠురోక్తులు ఇంద్రునియెడ చూపోపమితనము మన్మథునియెడ దౌష్ట్యము. వెల్లడింపఁబడినవి. అది జనసామాన్యమునకు దేవతానిందగాఁ దోచును. కాని అదియు నెక్కువ చనవుచేతనేయని యెఱుంగనగు కొన్ని పద్యముల యందు మీ దేవతలు మాభారతీయులు అనుసంఘభేదముల నేర్పఱచి తనకుగల దేశాభిమానమును వెల్లడించుటయు వారియందును తప్పుల గుర్తించుటయు గలదు మరియు స్వసంఘమందును "తనుజూడగాఢైన త్రాగుబోతైనను సతికి నీతులుసెప్ప సాహసించు" అని తప్పులను నెత్తిచూపుటయు గలదు. ఈమె మోమోటమిలేని నిష్పక్షపాతినియగు కవయిత్రీతిలకమ్మనవచ్చు. ఇట్టి ధైర్యమునకు ఈమెసాధిం

-చిన పవిత్రతయే కారణము 34 పద్యములో "నామది యమునా నదివలెఁ బ్రవహించె వరపవిత్రత యను వరద యొకటి" అని పవిత్రతాశక్తి వక్కాణింపఁ బడినది. మఱియు ప్రతిన అనుశీర్షికలో 61 వ పద్యమున గురువు దైవము దల్లి తండ్రి అను లోకోక్తుల తత్త్వార్థము వెల్లడింపఁ బడినది 61 పద్యమున 1 పవిత్రత, 2 పతిసేవ, 3 పాపభీతి 4 పరచింతన 5 పెద్దల యనుగ్రహము గలదాననైనచో నీవు వచ్చెదవు "రావదేనియు నిన్నింక రచ్చకీడ్చి పరువు దీతును. అని నాటినది. ఈ పంచామృతములె ఈమె ధైర్యము నింతగాఁ బోషించినవి. ఇట్టి భక్తురాలికి అమృత తుల్యములు అభినవములైన భావములావిర్భవించుటలో నాశ్చర్యమేమున్నది! త్యాగయ్యగారు "తరానలేనిపరాకు" "నను పాలింపనడచివచ్చితివో!" గగనానికిలకు బహుదూరం బనినాఁడో? అను నీభావరసగర్భితోక్తుల నెట్లువ్రాసిరి! భక్తి చేతనె ఆభక్తిలేని పండితులు కొండల పిండిచేసినట్లు ప్రచండములైన పదతండంబుల జోడించగలరు. కాని వారి కీరసోక్తులు రాగలవా? మణిమందిరము 82 వ పద్యములో అనసూయా పాతివ్రత్యమును వెల్లడించుచు "బుజ్జిపాపలఁ జేసి జోజ్జనింపె" "మాతృమూర్తిగ నింతలోమరచినారె! అను కమ్మని పలుకులచేత లోకములోని మహిళామాతలకు ఉత్తేజ మొసంగినది. 35వ పద్యములో "సూర్యుని నిల్పిన సుమ

తినే సాక్ష్యంబు" ఇత్యాదుల చేత పాతివ్రత్యమునకుమించిన శక్తి లేదని ఈకలికాలమున నీసమయమున నిట్టిధైర్యముతో సాటించుటకు పైగుణపంచకమే యీమె కీశక్తి నొసంగినదని చెప్పక తప్పదు. పండితులకు సైతము శిరఃకంపనము గలిగించు నీలలితభావముల సులభములగు వాడుకమాటలలో నిమిడ్చిన యీ పద్యరత్నములు ఈమెగారి పవిత్రతాసూత్రముచేతనే కూర్చబడినవి. ఈకావ్యము మేలిమి బంగారుతోఁ గట్టిన రత్నాభరణము వంటిది అనుట అతిశయోక్తి కాదు. అది యెల్లరకు శిరోభూషణము కాకతప్పదు ఈకవయిత్రి కీశ్వరుఁ డాయురారోగ్య భాగ్యములను అనవద్యమగు విద్యను అనర్గళమగు కవితను ప్రసాదించుగాకయని ఆసర్వేశ్వరునే ప్రార్థించుచున్నాను.

గూడూరు
27-6-59

ఇట్లు,
కాం. కృ. ఆచార్యు.

G. V. NARASINGA RAO M. A. B. L.,
R. D. O.
Madanapalle

శ్రీమతి సుంకర మణియమ్మ రచించిన "మణిమందిరము" నామూలాగ్రముగఁ జూచితిని. కథావస్తువు కవయిత్రీ తీవ్రతపస్సు. ఆధ్యాత్మికావేదన. అసదృశ్యతాధ్యాత్మ పరమవస్తు దర్శనార్థ ముప్పిళులూరు మంజులాభిలాష చిత్తమీశ్వరాయత్తమైనపుడు, భక్తిపారవశ్యమైనపుడు, బ్రహ్మానంద పులకితమైనపు డయాచితముగ ననివార్యముగ, హఠాత్తుగ నిర్మల గంగాస్రవంతి వడువున హృదయమందిరము వెలువడు అమృత వాక్సందోహమే మణిమందిర నిర్మాణము.

ఈశ్వరస్వరూపమును సహస్రవిధముల సృష్టించి, దోహద మొనర్చి సుమడోలల నూఁగించి జోలలఁబాలించి, తన మణిమందిర ప్రాంగణమున కాహ్వానించి, సర్వస్వము దోఁచుకొమ్మని, దొరవునీవని, పాలించుకొమ్మని ప్రాధేయపడు పరమ భాగవతురాలి యావేదన మణిమందిర స్వరూపము.

సచ్చిదానందస్వరూపమును సంపూర్ణముగ మనోవీధి నధిష్ఠింపించి, మాటలచే నెఱుకలచే, మననములచే దరిఁజేరఁగరాని శుచిననుష్టించి పుష్పాంజలితో మోకరించి, భవబంధ విమోచనకై నిరంతరకృపిసల్పి యల్లలాడు దీనురాలి దాసోహమే మణిమందిర ప్రవచనము.

కవి తనకు తోఁచినది వ్రాసి ప్రపంచములో పడవేయును. విజ్ఞులు దానిని చవిచూచి, జూచి, రుచులజాడఁ దెల్పుదురు. కథావస్తువు ఛందశ్శాస్త్రము, వ్యాకరణము, అలంకారవిశేషములు కవితాగానమునకు ముఖ్యాంగములు. కాని యీ శృంఖల విహారము భక్తి కనవసరము. భక్తి యన్నది ఈశ్వరుని స్వరూపము. పరమపవిత్రమైనది. దాని నవగాహన చేసికొని మననము చేసికొనుటయే అట్లుతరించు టచే మానవుని జీవిత పరమావధి. ఈరీతిననుసరించి జన్మ సార్థక్యము చేసికొన్న శ్రీమతి మణియమ్మను నేనెంతయు నభినందించుచున్నాను. ఈ సాధ్వీకలము ప్రసరించిన మణిమందిరాన పరమదయాపయోనిధియైన పరమాత్మ దేవుఁడధివసించి లోకకళ్యాణ మొనర్చుగాత!

మ॥ కృషిలోన న్గవితాకళన్భుజబలో ద్రేకోద్ధతి న్వార్తకో
న్మిష ధీచాతురి సంతతాభ్యుదయని గ్ణిద్రస్థితిన్గన్న సం
తుషితస్వాంతులు మత్కులీనులు యశో దుగ్ధాబ్ధి
రాకాసుధా
సుషమాపూర్ణుల వాక్ప్రసాదము శుభ స్ఫూర్తిన్మణి
న్బ్రోచుతన్.

మకాం మదనపల్లి
28-6-59

ఇట్లు,
గో. వె. నరసింగరావు.

V. R. NARLA,
EDITOR

ANDHRA PRABHA,
MADRAS-2.

# " మ ణి మం ది ర ము "

*

అప్రయత్న రచనలోని విసర్గసౌంద ర్యాన్ని పుణికి పుచ్చుకొన్న ఈ కావ్యం రసజ్ఞలోకం హర్షామోదాలను సంపాదించుకొన గలదనడంలో సందేహంలేదు.

— నార్ల వెంకటేశ్వరరావు.

26–6–59

మణిమందిరాహ్వాన శతకములోని పద్యమణుల నచ్చ టచ్చట స్థాలీపులాకన్యాయముగఁ దిలకించు భాగ్యమబ్బి నందులకెంతయో సంతసించుచున్నాను. కవయిత్రిగారి స్వాప్నానుభూతియు లక్ష్మీసరస్వతులందుగల బద్ధానురాగ భక్త్యావేశాది పవిత్రభావ పరంపరలవ్యంగ్య వైభవ వైచి త్రియే యిందితివృత్తముగను రమణీయార్థ ప్రతిపాదకము గను, నిందాస్తుతులు, వక్రోక్తులు మొదలగు చమత్కార జనకమగు పౌరాణిక గాథా విమర్శనలతో నీశతకకావ్య మొక యపూర్వాలంకారమును మహిళామండలికి కవయిత్రి వలెనే సమకూర్చుచున్నది. కవితాశైలి ధారాళమును, సరళముగను సులభముగనుండి బహుజనోపయుక్తముగ నున్నది. ఇట్టిగ్రంథములు విశ్వమానవ కల్యాణమును జేకూర్చునట్లును, సత్యధర్మాహింసలను బ్రోత్సహించునట్లును మఱికొన్ని వ్రాయుటకు శ్రీమతి మణిరామచంద్రరావు గారికి దీర్ఘాయురారోగ్యములు దైవము ప్రసాదించుగాక!

గూడూరు
10-5-59

G. విద్వాన్ రామకవి
1 గ్రేడ్ పండిట్
S. M. G. హైస్కూల్

శ్రీమతి సుంకర మణీరామచంద్రరావుగారు రచించిన "మణిమందిర" మను గ్రంథమును జూచితిని. ఈకవయిత్రి తనకు రమావాణులు సహాచరులని యటనటఁ జెప్పికొనుట నిక్కువముగనే తోఁచుచున్నది. అదృష్టవిశేషమున నీబిడకు మంచిభావములు స్ఫురించినవి. ప్రతిపద్యమున నేదేనొక చమత్కృతి. నిందాస్తుతి పతితలకు గోచరించును. మానవ కల్యాణమునకు పవిత్రతయే ప్రధానకారణమని యీగ్రంథము చాటుచున్నది.

ధారనిసర్గసరళమై పామరులకు సహిత మర్థావగతి గల్గించుననుట సహజోక్తి. పరమేశ్వరుఁ డాయురారోగ్యము లిచ్చి యింతకన్న మెఱుఁగైన కృతులీయమచే రచింపఁ జేయుఁగాక.

గూడూరు
10–5–59

కె. సి. జయచంద్రశాస్త్రి.
సాహిత్య విద్యాప్రవీణ సంస్కృత పండితుఁడు,
బోర్డు హైస్కూలు.

శ్రీమాన్ బి. రంగాచార్యులు,
శిరోమణి, విద్వాన్

B. H. School,
GUDUR, (Nellore)

శ్రీమతి S. మణిరామచంద్రరావుగారి కవితనవనవ భాసలలితమని ఈమె రచించిన మణిభావమణులు అను గ్రంథమే చాటుచున్నది. ప్రకృతము సరళ సుందరమగు శైలితోడను, విరచితమైన నీ మణిమందిరమును సంపూర్ణముగఁ బఠించితిని. ఇందులోని కల్పనలు అపూర్వములు పూర్వజన్మ సుకృత పరిపాకముచే కవయిత్రికి లబ్ధమైనవియే గాని సామాన్యుల కందరానివి. ఈ పొత్తమంతయు నిందా స్తుతులతోఁగూడి, భగవదాహ్వానరూపమై, భక్తిబంధురమై యలరారుచున్నది.

ఈ సాధ్వీమణి ముమ్ముందు భారతనారీ హృదయ రంజకములగు రచనలఁ జేయుచు ఉత్తమ కవయిత్రి కాఁగలదని విశ్వసింతును. శ్రీ మణియమ్మగారికి అందులకు వలయు సర్వశక్తిని ఆయురారోగ్యైశ్వర్యాదులను, ఈ మణిమంది రేశుఁడొసగుగాక.

గూడూరు
5—7—1959

ఇట్లు,
బి. రంగాచార్యులు.

శ్రీ పడాల రామమూర్తి
విద్వాన్
B. H. School

గూడూరు
10-7-59

చ॥ నినుగని పెంచి విద్యలను నేర్పినతండ్రికి వైద్యతల్లి జా
డని వినుతింగడించిన మహామతిసీపతిఁ గన్నతండ్రికిన్
గొనబుగఁ గావ్యకన్యనిడి కూరిమివారి ఋణంబు దీర్చుకొం
చును ఘనపుణ్యయోగమున సూరులు మెచ్చఁగఁ
గీర్తినొందవే

మ॥ అకలంకస్థిరభక్తితోఁ జనవుతో నత్యంతసంప్రీతితో॥
ప్రకటస్నేహభరమ్ముతో నలుకతోఁ వైకుంఠలోకేశుఁ ద
ప్పక మాయింటికి రమ్మురమ్మనుచు నాహ్వానించు
నీహృద్య ప
ద్యకదంబంబుఁ బఠించుచో మదిని బ్రహ్మానంద
ముప్పొంగదే॥

కవయిత్రీమణి! నెనుక మీ మణిభావమణులు అను గ్రంథముయొక్క ఆవిష్కరణసభలో క్షణక్షణ మభినవానందంబుఁ గలిగించు నా గ్రంథమందలి నూత్నభావములు నాచే నపుడే రెండు పద్యములఁ బలికించినవి వానినిఁగూడ నిటఁ బొందుపఱచుచున్నాను.

మ॥ కవయిత్రీమణి! నీదు భావమణులన్ ఁ గావ్యంబు
వీక్షించితిన్
సవిమర్శంబుగ నేమిసెప్పఁ దును యుష్మద్భావనానల్ప శ
క్తివచోధోరణి తీరు తీయముల జా ఁ తీయంబులింపొందగాఁ
శ్రవణానంద మొనర్చెఁ దత్కృతి పవి ఁ త్రత్వంబు
బోధించుచున్॥

మ॥ నుత వేదాంత విశారదుండయిన కాం ఁ చూర్ కృష్ణమా
చార్య పం
డిత కవ్యగ్రణి ముద్దుపెండ్లికొడుకై ఁ నీ కావ్యకన్యామనః
పతియయ్యెన్ గవయిత్రిరో! యిదిమహా ఁ భాగ్యంబు
వృద్ధించు నెం
చితో యేడుల్ పదునొండులోపలి వయ ఁ స్సే నీదు
జామాతకున్॥

ఇట్లు,
పదాల రామమూర్తి.

శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు
విద్వాన్
B. H. School

GUDUR
10-7-59

శ్రీమంతురాలు మణియమ్మగారు నిర్మించిన మణిమందిరము మిక్కిలి మక్కువతో కనుగొంటిని వర్తమానాంధ్రరచయిత్రీ లోకమున నీమె సముచితస్థాన మలంకరింపగలదనుటలో నెట్టిసందియము లేదు.

ముదివర్తి కొండమాచార్యులు.
విద్వాన్

# కృతజ్ఞత

సీ॥ రాజమహేంద్రాన రత్నంబునానొప్పి
కవిసార్వభౌముడన్ ఖ్యాతిగాంచి
భారతంబును వ్రాసి ప్రఖ్యాతిగన్నట్టి
ప్రతిభతో నొప్పిన పండితుండు
మణిమందిరములోకి మక్కువతోఁజని
చూచెనునందలి చోద్యములను
కృష్ణశాస్త్రియుగాంచి విష్ణునికొలువును
పరవశంబును జెంది పలికెనిట్లు

తే.గీ॥ మఱచె తనగొప్పననఁగను మాయగాదె
పొగడపాండిత్యమును లేని పొలతినన్ను
మనుమరాలిగ నెంచెనో మదిననంగ
కృపనుదీవించె శ్రీపాద కృష్ణశాస్త్రి.

సీ॥ గట్టిపాండిత్యంబు ఘనతయునుండిన
గర్వమించుకలేని కవివరుండు
వాణియిచ్చినధార వంకరగాకుండ
ఛందస్సుజెప్పిన శాంతిపరుఁడు
మణిమందిరములోకి మక్కువగాఁజని
పొలుపొందు శ్రీకృష్ణ కొలువుగాంచి

యందున్న దేవత ౼ లందర పరికించి
నాకుబంధువులంచు ౼ నతఁడెజింగి

తే॥గీ॥ తనయగానన్ను తలచియు ౼ తగువిధాన
మెచ్చెనెంతయొ ప్రీతితో ౼ మేలటంచు
చెప్పెభావాలయందున్న ౼ గొప్పలెంచి
ఘనుడుకాండూరి కృష్ణార్య ౼ కవివరుండు.

సీ॥ సంస్కృతాంధ్రములందు ౼ చక్కనికృషిసల్పి
విద్వానుబిరుదుల ౼ వెలయుచున్న
కవిసహోదరులెల్ల ౼ ఘనతరదీవెనల్
పంపుటచూడనా ౼ భావమందు
నటనకుదిట్టయా ౼ నలువరాణియెవారి
మనసునందుననిల్చి ౼ మాయజేసి
గర్వమన్ బీజంబు ౼ గట్టిగానాలోన
నాటింపతలచెను ౼ నాకుదోచె
పండితుల్ పొగడుట ౼ భారతికేయిచ్చి
దీవెనలన్నియు ౼ తీసికొంటి

తే॥గీ॥ పంచివేసితికాని నే ౼ పంచకున్న
నెట్లుభరియింతు నింతటి ౼ గట్టిబరువు
న్యాయమందురో కాదని ౼ నరసిమీరు
పరమపండితవర్యులు ౼ పల్కవలయు.

ఇట్లు పండితవిధేయురాలు.
శ్రీమతి, సుంకర మణిరామచంద్రరావు.

శ్రీ కృష్ణాయ నమః

# మహామందిరము



## దేవతాస్తుతి





కం॥ శ్రీవ్రాసిన శుభమిచ్చును
శ్రీవేడిన సంతలోన శ్రేయముగలుగున్
శ్రీవరుసనె సిరులుండును
శ్రీవర్ణము గావ్యమునకు క్షేమముగాదే 1

ఉ॥ అమ్మరోరమ్మనంచునిను నారడిచేసితినంచు రాత్రి మా
యమ్మను బోలివచ్చితివి యంతటత్రిప్పియు కాళ్ళనొవ్వగా
దుమ్ములురేగునట్లునను తొందరఁజేసియు నెందుబోతివి? నే
బమ్మెరపోతరాజునకు భారతినిన్ గని పెట్టిపట్టగన్. 2

తే॥గీ॥ శ్రీలుచిందెడు చిరునవ్వు స్నేహమొలుక
నేను జేసెడుపనులందు నేర్పునిచ్చి
తోడఁబుట్టువు చందానఁ దోడనున్న
గణపతయ్యకు నేనెప్డు గారెలిడుదు. 3

తే॥గీ॥ మనసునందలి కోర్కెల ఽ మర్మమెఱిగి
యడ్డుగల్పించి నొప్పించి ఽ యలఁతఁబెట్టి
నామనోర్వ్యదో పరికింప ఽ నన్నువిడని
యాదిశక్తికిఁగై మోడ్తు ఽ ననవరతము. 4

తే॥గీ॥ సృష్టినొనరించి పాలించి ఽ నష్టపఱచి
న్యాయనిర్ణయ మెఱుగంగ ఽ నటనసల్పి
మనుజులందున మనుజులై ఽ మసలుచున్న
ముగురుమూర్తులఁగేల్ మోడ్తు ఽ మోదముగను. 5

తే॥గీ॥ సతుల సౌభాగ్యదేవియో ఽ శంభురాణి!
స్త్రీలశోభనదేవియో ఽ శ్రీరమాంబ!
సర్వవిద్యల నొసఁగెడు ఽ శారదాంబ!
అందుకొనరమ్మ నాదు న ఽ ల్వాంజలులను. 6

తే॥గీ॥ భారతీయుల పాలిటి ఽ బంధులార!
దేవలోకనివాస సు ఽ దీప్తులార!
యష్టదిక్కులనేలెడు ఽ నన్నలార!
కరుణదీవించుడయ్య నే ఽ కరముమోడ్తు. 7

తే॥గీ॥ చీకటులుచీల్చి చెండాడి ఽ చిత్రమొదవ
తూర్పుదిక్కున నుదయించి ఽ నేర్పుమీఱ
మమ్ములేపుచు మహిలోన ఽ మహిమఁజూపు
కర్మసాక్షికినేనెప్డు ఽ కరము మోడ్తు. 8

తే॥గీ॥ బాలమనసుల నవ్వించు భాగ్యరాశి
భువిని వెన్నెల కాయించు పుణ్యమూర్తి
మామలకు తాతతండ్రుల మామయైన
చందమామకు కేల్ మోడ్తు సంతసమున. 9

తే॥గీ॥ అణువు మొదలుగ నాకాశ మంత్యమనఁగ
బ్రహ్మతేజస్సు నిండియే పరగుచుండ
చేతులెత్తని ప్రాణికి చేటుగాదె
కానసృష్టికి నేనెప్డు కరము మోడ్తు. 10



# కవయిత్రి చరిత్ర

సీ॥ శ్రీదేవి వాసంబు శృంగార నిలయంబు
రత్నాలపేటిక రాజమండ్రి
రాజరాజేంద్రుండు రాజ్యంబు చేసిన
రంగైన బంగారు రాజమండ్రి
కవినన్నయాఖ్యచే గంటంబుఁ బట్టించు
రాజకవీంద్రుల రాజమండ్రి
గోదావరీనాద గుంభిత క్షేత్రంబు
రత్నాలదీవి యీ రాజమండ్రి

తే॥గీ॥ రమ్యకవులకు వాసంబు ౹ రాజమండ్రి
రత్నవర్తక వైశ్యుల ౹ రాజమండ్రి
రామరాజ్యమువంటిది ౹ రాజమండ్రి
రమ్యరత్నాలుగలకొండ ౹ రాజమండ్రి. 11

సీ॥ పేరుగాంచినయట్టి ౹ పేపరుమిల్లుండె
కోటిలింగాలునాన్ ౹ వాటియుండె
దేవాలయములెన్నొ ౹ తేజరిల్లుచునుండె
గౌతమఋషివర్యు ౹ ఘట్టముండె
ఆంధ్రకేసరివంటి ౹ యాంధ్రులు చదివిన
మునిసిపల్ హైస్కూలు ౹ ఘనతనొప్పె
కోటలోపలియంచు ౹ కోటకావలియంచు
కోటగుమ్మంబంచు ౹ గుర్తులుండె

తే॥గీ॥ దానునుండిరి మాతాత ౹ దండ్రులెల్ల
అదియె నాజన్మభూమియై ౹ నమరెజగతి
బాల్యమంతయు గడపిన ౹ భాగ్యభూమి
రమ్యరత్నాలు గలకొండ ౹ రాజమండ్రి. 12

సీ॥ శ్రీపాదశాస్త్రినా ౹ చెన్నొందు చుండెడు
కవిసార్వభౌముండు ౹ కలఁడు కలఁడు
శాంతరూపముఁదాల్చి ౹ శ్యామలాంబ యనంగ
గ్రామదేవతచూపు ౹ కరుణ గలదు

సంస్కృతబోధల ǂ చక్కని విద్యల
కాంగ్రెసు భవనంబు ǂ కలదుదాన
ఆర్టుగాలరొకటి ǂ యందంబుగానుండె
కళలిచ్చుకళలెన్నొ ǂ కలవుదాన

తే॥గీ॥ గాన కోవిదులెందరో ǂ ఘనులుగలరు
ఆటలందున మేటులు ǂ నందుగలరు
అదియె మెట్టిన యింటికి ǂ నమరుచూరు
రమ్యరత్నాలుగలకొండ ǂ రాజమండ్రి. 13

సీ॥ తవ్వాల వంశంబు ǂ తగుపేరుగాంచెను
బలిజవంశములందు ǂ ప్రతిభగాంచి
తాత తరాలుగా ǂ ధరకీర్తిగాంచిరి
యగ్రహారములుంట ǂ నధిపులనుచు
నాకు ముత్తాతయా ǂ నాగన్నయనగను
తండ్రి తండ్రినిగన్న ǂ తండ్రియతఁడు
తాత వీరాస్వామి ǂ ధన్యులైనటువంటి
నాతండ్రిగారికి ǂ నాన్నయామె

గీ॥ అతఁడుగాంచెను నల్గుర ǂ ననుఁగుసుతుల
చూడకృష్ణయనాగేశ ǂ సూర్యరంగ
రావుపేరులనొప్పిరి ǂ రమ్యగుణులు
తలపరంగరావనువారె ǂ తండ్రినాకు. 14

సీ॥ సీతమ్మ యనఁగను ƒ తాతమ్మ నాకాయె
గౌరమ్మ నాన్నను ƒ కన్నతల్లి
గౌరమ్మసీతమ్మ ƒ ఘనకీర్తి గాంచిరి
ధర్మాత్మరాండ్రని ƒ ధరణియందు
అన్నదానముచేసి ƒ మన్ననల్ పొందిన
మగువలంచును వారిఁ ƒ బొగడుచుండ్రు
తెలిసినవారెల్ల ƒ తేటగాఁజెప్పంగ
వినియుంటి నాబాల్య ƒ వేళయందు

తే॥గీ॥ అట్టితవ్వాల వంశంబు ƒ పట్టినేను
రంగరావనుపేరున ƒ రమ్యకవిత
నెఱుగు నాతండ్రినుడులన్ని ƒ మెఱుగులేక
చెదలు కొఱుకంగ యవియన్ని ƒ చెదరిపోయె. 15

తే॥గీ॥ చిన్నతనమాట నాకప్డు ƒ కన్నతండ్రి
గారికవితల దాచంగ ƒ నేరనైతి
అంత్యదశయును వారికి ƒ నపుడెవచ్చె
వారికబ్బంబు నెలువడు ƒ వసతి తొలఁగె. 16

తే॥గీ॥ ఊహ తెలిసిన దాదిగా ƒ నుర్వియందు
అడుగు చుండెడు నవియెల్ల ƒ నపుడెయిచ్చి
ప్రేమతో పెంచినట్టి నా ƒ పితృమూర్తి
కన్నతండ్రికి నేనెప్డు ƒ కరముమోడ్తు. 17

తే॥గీ॥ చిన్నప్రశ్నల వేయుచు - చెంతవిడక
చందమామయ్యకథనాకుఁ - జక్కఁజెప్పు
మనగ నాకథఁజెప్పుచు - మందలించు
కన్నతండ్రికి నేనెప్డు - కరముమోడ్తు. 18

తే॥గీ॥ చుక్కలెట్టులు పుట్టెనో - సూర్యుఁడెట్లు
కొండమీదికి నెక్కెనో - గోటుగాను
ననెడు ప్రశ్నలకెల్లను - నపుడెసెప్పు
కన్నతండ్రికి నేనెప్డు - కరముమోడ్తు. 19

తే॥గీ॥ దేవుఁడెట్టులు పుట్టించె - దేశమంత
అలపురాదయ్య యోనాన్న - యతనికన్న
అపుడె పకపకనగుచును - నంతఁజెప్పు
కన్నతండ్రికి నేనెప్డు - కరముమోడ్తు. 20

తే॥గీ॥ బయట పదిమందిలోనుండి - పలుకుచున్న
నిదురవచ్చెను నాకని - నేనుబిలువ
సెలవునిండని స్నేహితుల్ - చెంతనుండి
యపుడెవచ్చెడునాన్నకే - యంజలిడుదు. 21

తే॥గీ॥ బుజమునందున నిడుకొని - బుజ్జగించి
భాగవత పద్యరత్నాలు - పఠనఁజేసి
జోలబాడంగ నాకప్డు - జోగురాగ
నిదురఁబుచ్చెడు నాన్నకే - నిడుదునతులు. 22

తే॥గీ॥ కాసులమ్మణి నాన్న! ఓ కన్ననాన్న
కథలజెప్పెదు రమ్మను కమ్మనైనఁ
వచ్చిరానట్టిమాటల వంపులరసి
చేతనెత్తెడు నాన్నకే జేజెవిడుదు. 23

తే॥గీ॥ రాజుకూతురు కథజెప్పు మోజుమీర
రాజుకూతురులాగనే రమ్యముగను
నాన్న నేర్తును నరునది నాల్గువిద్య
లనిన నవ్వెడునాన్నకే వినతిఁజేతు. 24

తే॥గీ॥ అపుడెయధ్యాత్మ రామాయణాదిగీత
ములను జెప్పించెగాన వృద్ధులను జేర్చి
భారతంబును బాగుగ పఠనఁజేసి
కథలజెప్పెడి నాన్నకే కరముమోడ్తు. 25

సీ॥ మిన్నువిరుగుచున్న మీదబడుచునున్న
తలయెత్తిచూడని తలఁపునాది
తిట్టిన పొగడిన గట్టిగా విననట్టి
మందమైనటువంటి మనసునాది
కష్టంబుసుఖమును కనుగొనఁ జాలని
మ్రానునుబోలిన మతియునాది
ఆకలియనుచును నమ్మదగ్గరనైన
నడిగి తిననియట్టి జడతనాది

తే॥గీ॥ అట్టినారీతులనుగని ƒ పెట్టి చూచి
వెఱ్ఱితల్లి యటంచును ƒ విసుగునెఱుఁగ
కుండ నామీఁదచూపుచు ƒ నిండుప్రీతి
కసరు టెరుగరునన్నెప్డు ƒ కన్నతండ్రి. 26

సీ॥ నాకువచ్చెడి కలల్ ƒ నాన్నతోఁ జెప్పంగ
నద్భుతంబుగ నన్ను ƒ నరయువారు
కలలోన కొండపై ƒ కలదు నాకొకమాత
ఆయమ్మనాకోర్కె ƒ లమరదీర్చు
ప్రతిరాత్రిపేచీలు ƒ పడకనుండియులేచి
అమ్మతీర్చును నంచు ƒ యలుకతోడ
మీరెవ్వరునునాకు ƒ నేరుగానీవద్దు
అమ్మయే యిచ్చును ƒ ననుచుబల్కు

తే॥గీ॥ చిన్నకోపంబు దాల్చెడు ƒ నన్నుఁజూచి
కరముచేనెత్తి ముద్దాడి ƒ కౌతుకముగ
అమ్మరావమ్మ ననుగన్న ƒ కొమ్మయనుచు
నన్ను నవ్వించువారు మా ƒ నాన్నగారు. 27

సీ॥ బడినుండివచ్చుట ƒ గడియైన నాలస్య
మగునేని మనసున ƒ దిగులుఁజెంది
నౌకరులనుబంపి ƒ నాబడివరకును
మనసుండఁ బట్టక ƒ మరియువారె

ఎదురుగ వచ్చియు నెన్నాళ్లొ చూడని
విధమున నన్ జూచి వేడ్కపడుచు
నా చేయిఁ బట్టుచు నాప్యాయ మొదవగా
నడిపించుకొని వచ్చి కసుమఘుదాన

తే॥గీ॥ అమ్మ యేటికి నాలస్యమయిన దనఁగ
ఆట జెప్పిరి కోలాట పాటతోడ
ననఁగ నాచేత పాడించి నవ్వుకొనెడు
కన్నతండ్రికి మించిన ఘనులుగలరె. 28

సీ॥ ఎండ కాయుచునుండ వేసవి కాలంపు
గాడ్పులు చెవిసోకి కాల్చుచుండ
బడికి వెళ్ళెడు నాకు బలపాల పెట్టెలో
చిల్లర డబ్బులు చేతనైచి
నోరెండిపోవును దారిలో సోడాను
కొనిపుచ్చుకొన్మమ్మ యనుచుఁ జెప్పి
మరునాడు కూడను మరల డబ్బులు వేయ
పెట్టె తెరువ డబ్బు లట్టెయుండ

తే॥గీ॥ నపుడె యాశ్చర్యముగఁ జూచి యనును నిట్లు
ఏమి తెలియని పిల్ల నే నేమి సేతు!
బ్రతుకు తెరువును నెరుఁగని బాలయనుచు
తలఁచి చింతించువారు నా తండ్రిగారు, 29

సీ॥ మానాన్న నన్నెంత ✽ మక్కువతోఁజూడ
మాయమ్మ నన్నొక్క ✽ మాటయనదు
నాఁతోడబుట్టువుల్ ✽ ననురాగముగఁజూచి
యాదరింతురు నన్ను ✽ నధికముగను
బంధువులందఱు ✽ బాగుగా నేనన్న
గౌరవించెడువారు ✽ ఘనముగాను
చదువుజెప్పెడివారు ✽ కుదురైన బిడ్డని
వారితనయలాగె ✽ గౌరవింత్రు

తే॥గీ॥ ఆటలాడెడు చెలులును ✽ నక్కచెల్లె
లనఁగ చూచెడు వారెంతో ✽ లక్ష్యముగను
హాయిగొలిపెడు నాబాల్య ✽ మందు సౌఖ్య
మెట్టివారికి రాదని ✽ పట్టిచెపుదు. 30

తే॥గీ॥ అప్పుడుండిన మాయింటి ✽ హద్దురీతి
పరగ పదియేండ్ల ప్రాయంపు ✽ బాల్యమందె
బడికి వెడలుటమానిన ✽ పడతినేను
వినుఁడుచెప్పెదు నాదగు ✽ వింతగాథ. 31

తే॥గీ॥ నాన్న చేర్చుము హైస్కూలు ✽ నందుననుచు
నేనుపేచీలఁ బెట్టంగ ✽ నేర్పుగాను
మగువ సీతాలదెల్పు సు ✽ మారిశతక
పద్యములఁజెప్పి బోధించు ✽ బాగుగాను. 32

సీ॥ ఆసతీయనసూయ | యందాల కథఁ జెప్పి
సీతమ్మ కథనంతఁ | జక్కఁ జెప్పి
చంద్రమతీదేవి | చందమంతయుఁ జెప్పి
సుమతి గాథను నున్న | సొంపుఁ జెప్పి
దమయంతి కథ నెత్తి | ధర్మమంతయుఁ జెప్పి
ఆస్వయంప్రభ కథ | యపుడు సెప్పి
భారత కథ లెంచి | పతిభక్తియనఁ జెప్పి
వారిమించినవారు | లేరటంచు

తే॥గీ॥ మనసునొప్పించకుండంగ | మాటఁ జెప్పి
బుజ్జగింతురు గాని నే | పోరుఁ బెట్ట
కోపగించరు నామీద | కొంచమైన
కసరు టెరుగనివారు నా | కన్నతండ్రి. 33

తే॥గీ॥ అంతలోననె మానాన్న | యసులఁ బాసి
బాధ తెలియని మనసుకు | బాణమనఁగ
నాన్నమరణంబు నన్నంతో | నలత బెట్టె
దైవమాయల నెఱుగంగఁ | దరమె తలప. 34

తే॥గీ॥ అంతనా కేమితోచక | చింతగాను
బడికిపంపుడు నన్నని | పట్టుఁబట్ట
స్కూలు హెడ్మాష్టరు రైర్ఢు | శుద్ధయశులు
శాంతినుండిరి నరసింహ | శాస్త్రిగారు. 35

తే॥గీ॥ చదువు చెప్పుట కొఱకును ¶ ముదముగాను
వారిబిలిపించి పెట్టిరి ¶ నైనముగను
జీతమనిగాక ప్రేమతో ¶ తాతవలెను
పాఠములఁజెప్పె నాకంత ¶ పట్టుదలగ. 36

సీ॥ ఆంగ్ల భాషను నేర్ప ¶ నపుడె మొదలు పెట్టి
నా శ్రద్ధగని వారు ¶ నయముతోడ
చింతించ వలదమ్మ ¶ యెంతేసివిద్యను
నేర్వంగవచ్చును ¶ నింటిలోన
ఇంగ్లీషుభాష నీ ¶ వెంతయొ వడినేర్చి
చదివి పరీక్షకుఁ ¶ జనగవచ్చు
ననుచు దెల్పుచునాకు ¶ ఘనత మీరగఁజెప్పె
స్కూలుఫైనల్ కోర్సు ¶ సూత్రములను

తే॥గీ॥ ఇట్టులెంతయుశ్రద్ధగా ¶ పట్టిచెప్పి
చక్కనైనట్టి శ్లోకాలు ¶ చదువుచుండి
దానియర్థంబు చెప్పెడు ¶ తాతబోలు
నట్టి నరసింహ శాస్త్రికే ¶ నతులఁజేతు. 37

సీ॥ మావీధి గదిలోన ¶ మరియెవ్వరోగాని
శాస్త్రిగారినిఁ జూచి ¶ చనవుతోడ
పాపుఘుంటకులోనె ¶ పాఠంబు చదివెనా
యేమి చెప్పితిరని ¶ యెంచియడుగ

ననుభవంబున్నట్టి § ఘనుడఁగునాశాస్త్రి
పకపక నగుచును § పలుకునిట్లు
రానివారికివిద్య § రాత్రియుపగలైన
చెప్పిన నచ్చునా § చిన్నపలుకు
విద్యనేర్పుటకేను § వెడఁగుటలేదయ్య
జన్మాంతరావాస § జడతనుండి

తే॥గీ॥ లేపుచుంటిని నామెను § వీపుతట్టి
యనుచు చెప్పితి నిన్ననే § యతనితోడ
ననుచు నవ్వుచు మరునాడు § నాకుజెప్పు
నట్టినరసింహశాస్త్రికే § నతులఁజేతు.

సీ॥ పెద్దవారలువారు § పిల్లగాఁజూడక
మీరని పిలిచినన్ § గౌరవింప
తాతబోలినవారు § తండ్రికిగురువులు
మీరనీ నన్బిల్వ § మేలుగాదు
అనిన నవ్వుచుశాస్త్రి § యహా నది నిజమమ్మ
చిన్నపెద్దలులేవు § చిత్తమునకు
మీయందుభారతి § మేళవించియెయుండె
గౌరవించుట తప్పు § కాదటంచు
చిరునవ్వుతోవిద్య § గరపినయటువంటి
నరసింహశాస్త్రికే § నతులఁజేతు

తే॥గీ॥ కొంత కాలము చదువందు § కొరత లేదు
కానివిఘ్నంబు గలిగెను § కర్మఫలము
కంటిలోదుమ్ముపడి వారి § కంటిచూపు
కనుపడకపోయె వార్థక్య § కాలమూలు. 39

సీ॥ అంతటనాలోన § వంతనుజెందితి
చదువుకు నోచని § చానననుచు
హాతమియనియేఁడు § గ్రంథాలయమునుండి
పుస్తకాల్ తెప్పించి § పొలుపుమీఱ
చదువుచుండియు నేను § చక్కనైనటువంటి
భాగవతంబును § పఠనఁజేసి
నరసింహశతకశం § కరకృతలక్ష్మీనృ
సింహుని నుతియును § చెప్పుచుందు

తే॥గీ॥ గీతచదువుచు కాలంబు § గెంటుచున్న
పెండ్లిచేసిరి నాకప్డు § పెద్దలంత
నింకనాయత్తవారిదౌ § యింటిరీతి
యదియుఁ జెప్పెద నికమీద § నందముగను. 40

సీ॥ సుందరంబయినట్టి § సుంకర వంశాన
రామయ్యనాయఁడు § రత్నమనఁగ
సాధుసంతర్పణ § సతతంబు చేయుచు
రాజయోగంబున § తేజమొందె

యెస్టేటులన్నియు ʃ నష్టంబులయినను
ధర్మంబు విడువని ʃ ధన్యుఁడతఁడు
పత్ని రామాయమ్మ ʃ పతిసేయుపనులకు
నడ్డంబు పలుకని ʃ యబలయట్టి

తే॥గీ॥ పావనంబైన దాంపత్య ʃ ఫలముగాను
జనన మందిరినాపతి ʃ జనకులరయ
ప్రతిభగాంచిరి వైద్యాన ʃ ప్రముఖులనుచు
స్వామి యనుపేర బరగు నా ʃ మామగారు. 4

సీ॥ పదిమంది వత్తురు ʃ పలుకులబలమేమొ
స్వామినాయఁడుగారి ʃ సఖ్యమునకు
ఉచితంబుగా వైద్య ʃ మోర్పుతో చేయంగ
ధర్మాత్మ డాక్టరు ʃ దారులనిరి
పేదలనందఱిఁ ʃ ప్రేమతో చూడంగ
కనికరంబున జాల ʃ ఘనతగాంచె
అందఱు నమ్ముచు ʃ నాదరించుచునున్న
మహనీయుఁడా నాయఁ ʃ డహహాయనిరి

తే॥గీ॥ ధరణి సుంకరవంశమన్ ʃ తరువునందు
స్వామియన్ పుష్పరాజంబు ʃ సంభవిల్లె
పలుదెసలు వీచెనాపుష్ప ʃ పరిమళంబు
మరపురానట్టివారు నా ʃ మామగారు. 4.

సీ॥ సర్వంబు తెలిసియు ƒ గర్వంబునెఱుఁగక
తండ్రిబోలినవారు ƒ ధన్యతములు
సంస్కృతాంధ్రములన్నఁ ƒ జక్కనియభిలాష
పండితస్నేహాన ƒ నుండువారు
మాయమర్మములేని ƒ మనసొప్పియుండుట
గొప్పవారనఁగను ƒ నొప్పువారు
వారియింటికి నేను ƒ గౌరవమొప్పంగఁ
బెద్దకోడలనైతి ƒ పేర్మితోడ

తే॥గీ॥ ఘనులు నా మామగారంత ƒ గారవించి
తనయగానన్ను జూచిన ƒ తగువిధంబు
మాట పడదయ్యె మనసును ƒ దాటుకొనదు.
మరపురానట్టివారు నా ƒ మామగారు 43

సీ॥ మణియమ్మయనుచును ƒ మనసార బిల్చుచు
సొక్కుచు ప్రేమతోఁ ƒ జూచువారు
స్వల్పసేవకునైన ƒ నల్పసంతోషంబు
పొందుచు పరులతో ƒ పొగడువారు
తల్లిలాగునసేవ ƒ లెల్ల చేయునునాకు
ననుచుచెప్పెడువారు ƒ నన్నుగూర్చి
అధ్యాత్మకీర్తన ƒ లన్నియుపాడించి
సంతసించెడువారు ƒ సంభ్రమముగ

తే॥గీ॥ పద్యముల్ శ్లోకములనన్ని ƒ పఠనఁజేయ
స్వచ్ఛమైనట్టి వాక్కుని ƒ మెచ్చుకొనుచు
తండ్రి మరపించగలవారు ƒ ధన్యులగయ
మరపురానట్టివారు నా ƒ మామగారు. 4

సీ॥ నాపతి యంతట ƒ నరిగెవైజాగుకు
వైద్య విద్యనునేర్చి ƒ వచ్చుకొఱకు
పదము లో త్రైడువేళ ƒ పలుమారుజెప్పను
బాగుగా చదువంగ ƒ పట్టుబట్టి
జాబునువ్రాయుము ƒ శ్రద్ధగానీవని
కన్నకూతురుమాడ్కి ƒ కాంచినన్ను
చెప్పియు మరునాడు ƒ చెంతకుననుబిల్చి
కమ్మవ్రాసితెమణి ƒ యమ్మయనును

తే॥గీ॥ చనవు నిచ్చియు నన్నెంతొ ƒ ఘనతగాను
తండ్రిలేరను లోటును ƒ తరిమెవారు
నన్నుజూచిరి యెంతయు ƒ మిన్నగాను
మరపురానట్టి వారు నా ƒ మామగారు. 45

సీ॥ నాచిన్నతనమున ƒ నాతండ్రిగారును
మామగారును నెంతొ ƒ మైత్రితోడ
రోజునకొకసారి ƒ మోజుగావచ్చుచు
మానాన్నతో వారు ƒ మాటలాడి

ఏమాటలైనను ƒ నిష్టంబుగాఁజెప్పి
సలహాలనడుగుచు ƒ సరియెయనుచు
పెద్దవారిగనెంచి ƒ కొద్దియైనను దెల్పి
గౌరవించెడువారు ƒ ఘనతమీర

తే॥గీ॥ మామగారును నాన్నయు ƒ మాటలాడ
కాఫిత్రాగెడు కాలంబు ƒ కాదు గాన
చిక్కనైనట్టి మజ్జిగ ƒ చక్కదెచ్చి
మామగారికినేనీయ ƒ మక్కువగను. 46

తే॥గీ॥ పేరుయేమిటి నీదని ƒ ప్రీతిగాను
నడిగినను పల్కనటుఁవంటి ƒ నన్నుఁజూచి
పల్కులేరావమీఁదగు ƒ పాపకనుచు
నాన్నతో గూడి వారును ƒ నవ్వువారు 47

సీ॥ కార్లుతక్కువయట్టి ƒ కాలంబునందున
మామగారు కొనిరి ƒ మంచికారు
సాయంతనపువేళ ƒ చక్కగ కారులో
రోగులచూడంగ ƒ నేగువారు
వారిడ్రైవరువచ్చి ƒ వాకిలిముందుకు
నను బిల్చి రమ్మను ƒ చనవుగాను
జోడుతో మేజోళ్లు ƒ జోడించి నే తేగ
కారులో నాతండ్రి ƒ కాళ్ళకేయు

తే॥గీ॥ ఇంతలో మామగారెక్క § వింతగాను
నన్ను జూచుచు నవ్వుచు § ననునునిట్లు
ఎట్లు వచ్చెను కోడలు § నెక్కుకోఱకు
పిల్చినను పల్కనట్టి నీ § పిల్ల తాను. 48

సీ॥ నా తోడ మాట్లాడ § నామోపిగానీకు
నా కోరు నెక్కంగ § న్యాయమౌన
యని చేయి బట్టియు § ననుబిల్చినన్ గాని
వారిదగ్గర గాను § జరుగనేను
మరునాడు వచ్చియు § మా యింటికూర్చుండి
మానాన్నప్రక్కను § నన్ను జూచి
మూగదాయేమి మీ § ముద్దుకోడలటంచు
హేలగాననుజూచి § గేలిచేయ

తే॥గీ॥ నపుడు నవ్వుచు నిట్లను § నాన్నగారు
నోరులేనట్టి బాలిక § దూరమైన
బడికి పంపగ కూడను § భయమునాకు
వెఱ్ఱిదని చెప్పువారు నా § వెఱ్ఱితండ్రి. 49

తే॥గీ॥ కొత్తవారలు కారు నా § యత్తవారు
అపుడు కూడను నాకర్మ § యడ్డమయ్యె
మామగారును మరణింప § మనసునందు
తగిలె రెండవ బాణంబు § ఘాటిగాను. 50

# 1958 సం॥ స్వప్నము: అంకితము



సీ॥ నెల్లూరనుండంగ ǂ పిల్లలు నేనును
చల్లని పంకాను ǂ మెల్లవైచి
పదిఘంటలాయెను ǂ నిదురపొందనుచును
కథలాపనేను న ǂ క్కాలమందు
పతియోగియుండిరి ǂ పనిగల్గిదూరాన
నిడదవోల్ మిత్రుని ǂ నిలయమునకు
అపుడె నిద్దురరాక ǂ యటునిటుదొర్లుచు
గడచినకాలమే ǂ కండ్లఁదోచ

తే॥గీ॥ అంతదలఁచితి బాల్యంపు ǂ టాటలన్ని
దలఁచినంతనె నాతండ్రి ǂ తలఁపు గలిగె
తండ్రిబోలిన వారలు ǂ ధన్యులయిన
మామగారును నాకప్డు ǂ మదికిరాఁగ. 51

తే॥గీ॥ వారలుండిన నేనెంతొ ǂ వాసిచెంది
భువిని రాణింతుననుచును ǂ బుద్ధిగలుగ
అట్టివారల ఋణమునే ǂ నెట్టుదీర్తు
ననుచు దలపంగ నామది ǂ నలతఁజెందె, 52

తే॥గీ॥ శాంతినిలయాలు గట్టియు - సత్రములను
కట్టియీయంగఁ జాలిన - కాంతగాను
మనసునూహాలఁ కృతిగ నే - ఘనతకూర్చి
తండ్రిమామల పాదాల - దండనిడుదు. 53

తే॥గీ॥ అనుచుఁ దలఁచితి మనసున - నంతలోనె
కలఁతఁజెందిన నేనప్డు - కనులుమూయ
వీధితలుపును తట్టుచు - వింతగాను
పరిచయంబుగ పిలిచిన - పరుగుతోడ. 54

సీ॥ గబగబ వెడలి నే - గడియతీసియు వేగ
వచ్చిన వారిని - గ్రుచ్చిచూచి
గడపదాటియు వారు - గదిలోకివచ్చిన
మ్రాన్ పడి నానోట - మాటరాదు
మానాన్న ప్రక్కను - మామగారుండిరి
చోద్యమాయెను నాకు - చూడగాను
చిట్టచివరకప్డు - చేరునగనుపించు
పేముకుర్చీలెత్తి - ప్రీతివైచి

తే॥గీ॥ కండ్లనెత్తుచు వారిని - గాంచిన-త
నన్నుచూచుచు చిరునవ్వు - నాట్యమాడ
అందుకూర్చుండ నేనంత - నచటికరిగి
వారిపాదాలమ్రొక్కంగ - వంగునప్డు. 55

తే॥గీ॥ నన్ను నొంటిగ విడిచియు ƒ నాన్నమీఁదు
మామగారును నే దేశ ƒ మందునుంటి
రింత కాలంబునకు నేను ƒ నిచటనుండ
నన్ను వెదకుచువచ్చితో ƒ నాన్నయనిన. 56

సీ॥ గట్టు తెగిన యట్టి ƒ గంగాప్రవాహంబు
హద్దులేకుండను ƒ నరుగుపగిది
నాకండ్ల నీరేమొ ƒ దాకొన్నరీతిగా
జలజల వర్షంపు ƒ జల్లులయ్యె
నాల్గుపాదాలను ƒ నాదు చేతులఁ బట్టి
కన్నీటిజలములే ƒ కాళ్ళకడిగె
నాతండ్రి కన్నీట ƒ వాతల తడిసెను
మామగారప్డు నన్ ƒ మందలించి

తే॥గీ॥ గడ్డమెత్తియు కన్నీరు ƒ కరముతోడ
తుడిచివైచుచు ప్రేమతో ƒ నుడివిరిట్లు
చూడుమణి యమ్మనీవిట్లు ƒ వాడియుండ
నాన్నగారెంతో నిన్ జూచి ƒ నలఁతబడిరి. 57

సీ॥ నాయఁడుగారెంతో ƒ నలతనుగొన్నారు
నీకైన తీరును ƒ నిలిచిచూచి
దేశాటనములాయె ƒ తీరికయ్యెను మాకు
నీచెంతనుందుము ƒ నిక్కముగను

అనుచు నోదార్చుచు - నంమున్న బిడ్డల
చిరునవ్వుతోఁ గాంచి - చేతులెత్తి
చంటిబిడ్డయు నేడ్వ - చప్పున లేచితి
కన్నీటితో నిండి - కన్నులుండె

తే॥గీ॥ నద్భుతంబైన కలవచ్చె - ననుచు నేను
మోదమంతితి వారికి - మ్రొక్కి మదిని
నట్టి నాతండ్రి మామల - గట్టికరుణ
కాచుచుండును నన్నెట్టి - కాలమందు.

తే॥గీ॥ వారికంకిత మీయన - వాఙ్గాను
భావరాసుల నాకిచ్చె - భారతమ్మ
తండ్రిమామల యాత్మల - దనరు శక్తి
నాకుఁతోఁడౌచు కలమును - నడుపుగాక.



కవయిత్రి మామగారు

కృ తి ప తి



శ్రీ సుంకర స్వామినాయుడుగారు

డాక్టర్ - రాజమండ్రి.

కవయిత్రి తండ్రిగారు

కృతిపతి



శ్రీ తవ్వాల రంగారావు నాయుడుగారు

బి. యమ్. - రాజమండ్రి.

# గ్రంథావతరణ సంకల్పము ప్రతిన

సీ॥ తల్లిదండ్రులనెంచి ఽ తగుభక్తితో మ్రొక్కి
అత్తమామలకంత ఽ యార్తి మ్రొక్కి
* వీరభద్రుండన ఽ వెలసిన యఁనువంటి
పాపతోఁబుట్టుకు ఽ భక్తి మ్రొక్కి
అత్తింటి పుట్టింటి ఽ యారాధ్యదైవాల
కులదేవతలకంత ఽ కోరి మ్రొక్కి
ఛందస్సు నెరిగించి ఽ చక్కంగఁ జేసిన
కాండూరి కృష్ణార్య ఽ కవికి మ్రొక్కి
తే॥గీ॥ వ్రాయుచుంటిని నాచిన్న ఽ వ్రాఁతలోన
పిలుచుచుంటిని పరమాత్మ ఽ పలుకుమనుచు
పలుకకున్నను చెప్పుదు నే ఽ పంతగించి
దైవమే లేదటంచు నీ ఽ ధరణియందు. 60

సీ॥ వరపవిత్రతనాకు ఽ పరమలక్ష్యంబేని
పతిపాదములఁ గొల్చు ఽ సతినె యేని

* నాతోఁబుట్టువు చంటిబిడ్డగా నుండి చనిపోయెను. వానిని వీరభద్రుఁడు అను పేరుతో కొల్చుట మా దేశాచారము.

ఊహ తెలిసినంత నుర్వియందుననున్న
పాపాలభయపడు పడఁతి నేని
పెద్దలయందున నొద్దికగానుండి
వారిప్రేమను బొందు వనిత నేని
దేవతాశక్తియే భావాల నియ్యంగ
కవితను మొదలిడు కాంత నేని

తే॥గీ॥ పల్కరమ్మింక నాయింట పదమునిడగ
రావదేనియు నిన్నింక రచ్చకీడ్చి
పరువుదీతును నిదియ నా ప్రతిన వినుము
దైవమే లేదటంచు నీ ధరణియందు. 61



# మహోమందిర

## ప్రారంభము



సీ॥ శ్రీనివక్షంబున చెన్నొందఁ దాల్చిన
చక్కని నవ్వుల । చక్రధరుఁడ
అలరి వైకుంఠాని । కొండాలరాజువై
ధర్మపాలన చేయు । ధర్మదేవ
దశరూపముల దాల్చి । ధర్మసంస్థాపన
పొలపొందఁ జేసిన । పుణ్యమూర్తి
సర్వజీవులకును । సమవర్తనుఁడవైన
తండ్రినీవేకదా । ధర్మరూప

తే॥గీ॥ అట్లునేనొక తనయను ॥ నాదిమూర్తి
భక్తినాతిథ్యమిత్తు నా ॥ శక్తికొలది
రమ్ము రమ్మయ్య మణిమంది ॥ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ॥ పంతమేల.

సీ॥ కరిని గాచినయట్టి ॥ ఘనుడవునీవంచు
ప్రహ్లాదుఁ బ్రోచిన ॥ ప్రభుడవంచు
భక్తరక్షణచేయ ॥ భద్రకంకణమెప్డు
కరమునఁదాల్చు ము ॥ రారియనుచ
కలియుగంబునఁగూడ ॥ పలుపలువిధముల
భక్తబృందము కంట ॥ పడితివంచు
వ్రాసిన కథలన్ని ॥ వరుసగా నమ్మి నే
నన్నుఁబ్రోచెదవంచు ॥ నమ్మియుంట

తే॥గీ॥ ఇట్టితరి నీవు వచ్చుట ॥ గిట్టకున్న
ఎట్లునమ్ముదు నీకథల్ ॥ గట్టివనుచు
రమ్ము రమ్మయ్య మణిమంది ॥ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ॥ పంతమేల.

సీ॥ ఈవిశ్వసంసార ॥ వివిధకార్యములందు
విసుగుఁజెందుచు నీవు ॥ వినుటలేద
ప్రారబ్ధ కర్మల ॥ పడతినేననుచును
పలుమరు పిలిచిన ॥ పలుకలేద

కాశీ ప్రయాగల ॥ ఘనతరక్షేత్రాల
చూడక యున్నదీ ॥ సువతి యనియు
దేవాలయముకేగి ॥ దైవదర్శనమైన
చేయజాలని యట్టి ॥ చేడెయనియు

తే॥గీ॥ ఎట్టిమనసున నుంటివో ॥ తట్టదాయె
భక్తసులభుఁడవంచునా ॥ సక్తిగాను
రమ్ము రమ్మయ్య మణిమంది ॥ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ॥ పంతమేల. 3

సీ॥ నీవు ప్రోచినయట్టి ॥ నీభక్తులెల్లరు
నేకెట్టి చుట్టాలు ॥ నాకుఁజెప్పు
తల్లి తరపువార ॥ తండ్రిదగ్గర వార
తాతముత్తాతల ॥ తరమువార
అత్తమామల వంశ ॥ మంటిన చుట్టాల
యెట్లు చుట్టాలైరొ ॥ యెంచి చెప్పు
చెప్పకున్నను నిన్ను ॥ తప్పకుండగ నందు
పక్షపాతముఁ జూపు ॥ ప్రభుఁడవనుచు

తే॥గీ॥ తట్టిచెప్పంగ గలను నే ॥ ధరణియందు
అలుసుదనమేల నామీద ॥ నలుకమాని
రమ్ము రమ్మయ్య మణిమంది ॥ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ॥ పంతమేల. 4

సీ॥ నీకునాకునుగల ॥ నిండైన బంధుత్వ
మెఱిగింతు నిపుడేను ॥ సరిగవినుమ
నాతండ్రి నీవంటి ॥ నీతనూజను నేను
నాయింట నడుగిడ ॥ న్యాయమంటి
నాకున్న దానిలో ॥ నీకీయ గలనంటి
చేతులారగ సేవఁ ॥ జేతునంటి
సృష్టి చిత్రము లెల్ల ॥ స్పష్టంబుగానిన్ను
నడిగి తెలియఁగనే ॥ గడగియుంటి

తే॥గీ॥ దట్టమైనట్టి నామది ॥ కట్టడాన
నిన్నుచూచెడు కోర్కెయే ॥ నిండఁకొనియె
రమ్ము రమ్మయ్య మణిమఁది ॥ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ॥ పంతమేల.

సీ॥ వేదాంత మార్గంబు ॥ విన లేదు కన లేదు
ప్రణవబీజాక్షర ॥ పఠన లేదు
పంచాక్షరిజపంబు ॥ భక్తిచేయగ లేదు
హరికథల్ వినుటకు ॥ నరుగ లేదు
ధరను నీభక్తుల ॥ దర్శింప చన లేదు
పుణ్యానదుల నేను ॥ మునుఁగ లేదు
నీనామ చింతన ॥ నిశ్చల మనసుతో
జపమాల ధరియించి ॥ జరుప లేదు

తే॥గీ॥ ఒప్పుకొంటిని నాతప్పు ॥ లొప్పుగాను
జాలికలుగంగ లేదయ్య ॥ జాలమేల
రమ్ము రమ్మయ్య మణిమంది ॥ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ॥ పంతమేల. 6

సీ॥ సంసార మనునట్టి ॥ సాగరమందున
శాంతియన్ నౌకను ॥ చక్కనెక్కి
నిన్ను చేరెదనంచు ॥ నేర్పుతోనడుపంగ
ఆశయే యనునల ॥ యడ్డు పరచు
దారి తప్పినవేళ ॥ తల్లడిల్లుచునుందు
సరిమార్గ మరయంగ ॥ సాధ్యపడదు
నీమాయ నెఱిఁగెడు ॥ నేర్పరు లెవరన్న
నేనెంత వాడనో ॥ నీవెచెప్పు

తే॥గీ॥ సృష్టికర్తకె రక్షింప ॥ కష్టమైన
దారి చూపెడు ధన్యులీ ॥ ధరణినెవరు
రమ్ము రమ్మయ్య మణిమంది ॥ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ॥ పంతమేల. 7

సీ॥ సంసార శకటంబు ॥ సంతోషముగనెక్కి
సరియైన త్రోవనే ॥ జనుచునుండ
క్రోధంబునాఁ బులి ॥ గూర్గ్రించుచునువచ్చి
సహనమే యనునెద్దుఁ ॥ జంపఁజూడ

నాయుధంబులు లేని ƒ యబల నేనెట్టులు
కాపాడగలనంచు ƒ కలఁతఁజెంది
కరుణించరమ్మని ƒ కడు బాధతోఁ బిల్వ
కదలవు మెదలవు ƒ కంటఁబడవు

తే॥గీ॥ నటన యేటికి నన్నింత ƒ నలత బెట్టి
చూచుచుందువు నామాట ƒ చొరద దేల
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 8

సీ॥ ఎట్టిచనవుచేత ƒ నిట్టుపిలిచితి వంచు
అడిగెదవేని నే ƒ వడిగఁజెపుదు
క్రొత్తవాఁడవుగావు ƒ బిత్తర పడుటకు
నిదివరకొకసారి ƒ నిన్నుగంటి
జ్ఞాపకంబును జేతు ƒ దాపరికం బేల
అప్పుడౌనని నీవు ƒ సెప్పఁగలవు
మాయఁబెట్టకు మింక ƒ మనసును మరపించి
ముప్పతిప్పలు బెట్టి ƒ తప్పుకొనకు

తే॥గీ॥ మనసు విరిగినమీఁదట ƒ మందు లేదు
విసుగు గలిగించనీకొక ƒ విలువ తగ్గు
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 9

సీ॥ ఒకనాటిరాత్రిలో ǂ నొకవింతఁ జూచితి
అదియుఁజెప్పెద నీకు ǂ నాలకించు
సుడిగాలివచ్చినన్ ǂ చుట్టబెట్టుకపోయె
నంతరిక్షమునందు ǂ వింతగాను
నొకచోటనేనాగి ǂ వికలచిత్తంబుతో
దేవాలయంబును ǂ దేవగాంచ
నింతలోనాగాలి ǂ యెంతయోవిసరున
మరియొకచోఁజేర్చ ǂ మరలనేను
కన్నులువిప్పుచు ǂ కంటిచిత్రంబును
మరియొక దేవతా ǂ మండపంబు

తే॥గీ॥ ఇట్లుచూచిన వెన్నియో ǂ యెంచలేను
కనులు దెరచితి కాకులు ǂ కావుమనఁగ
రమ్ము రమ్మయ్య మణిమంది ǂ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ǂ పంతమేల, 62

సీ॥ వింతపైవింతలు ǂ వినుమునేఁజెప్పెద
నాలించియర్థఁబు ǂ నరసిచెప్పు
బాలింతనై యుండి ǂ పసిబిడ్డప్రక్కలో
పడుకొనియుంటిని ǂ భద్రముగను
కనులుమూసినవేళ ǂ కంటిని స్వప్నంబు
అద్భుతంబైనట్టి ǂ యడవిలోన

పరుగెత్తుచుంటిని ƒ పదములుతడబడ
నడుగులు వేయంగ ƒ నడవిలోని

తే॥గీ॥ పులులుసింహాదులెన్నియో ƒ ముందుఁజేరి
యడ్డుపెట్టంగ నేనంత ƒ నలసిపోతి
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 63

సీ॥ ఎన్నియడ్డాలైన ƒ నెంతయోయోర్చి నే
ముందుకేపోతిని ƒ మూలపురుష
గాలివానయుఁగూడ ƒ ధూళితోరేగెను
దారికన్పించక ƒ తల్లడిలితి
బారకునొకపులి ƒ పైపైనఁబడరాఁగ
గుండెలు దడదడ ƒ కొట్టుకొనగ
నోరుల తెరువంగ : బోరునసింహాలు
కండ్లమూసితినప్డు ƒ కాంచలేక
బలహీననయి నేను ƒ పడిపోవుసమయాన
మాయమైపోవంగ ƒ మగువయొక తె

తే॥గీ॥ రెండుచేతులచాపినన్ ƒ నిండుకరుణ
గౌగలించెను నదియేమి ƒ కలయొసెపుమ
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 64

సీ॥ స్పృహాలేని నన్నప్డు ƒ చుట్టుముట్టడి వేసి
చలువకమ్మనునంచు ƒ కలువరమున
మాంవారు పెట్టిరి ƒ మంటతో కుంపటి
కాళ్ళు చేతులు కాచి ƒ కడకువారు
వెల్లుల్లి రేఖల ƒ పొల్లును కలిపియు
పచ్చని పసుపుతో ƒ పాదములకు
రుద్దుచునుండిరి ƒ బద్దకమ్మును బోయె
కన్గవతో వారిఁ ƒ కాంచియుంటి

తే॥గీ॥ దీనియర్థంబు చెప్పుమీ ƒ తేటగాను
నాదు భావంబు చెప్పెద ƒ నవ్వవేని
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 65

సీ॥ పదనొకండేండ్లాయె ƒ పరమాత్మ కలవచ్చి
నాకైన యర్థంబు ƒ నీకుఁ జెపుదు
సంసారమనియెఁడు ƒ సాంద్రంపుటడివిలో
పులులసింహాలను ƒ బోలియుండు
కష్టంబులెన్నియో ƒ కల్గునీకనుచును
తెలియజెప్పెను నాదు ƒ చెలియ యొకతె
అలసిపోయిన వేళ ƒ నతివ తానే వచ్చి
యామె కౌగిలిలోన ƒ నణచి నైచె

తే॥గీ॥ నవ్వువచ్చెన? నాభావ ‡ నలనుగాంచి!
నీవుచెప్పంగ విందులే ‡ నిజమదేదో ?
రమ్ము రమ్మయ్య మణిమంది ‡ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ‡ పంతమేల. 66

సీ॥ వేరొకసంగతి ‡ వింతగాఁజరిగెను
విసుగుచెందకనీవు ‡ వినుమువేని
పదునాలుగేండ్లాయె ‡ పతియేగియుండిరి
వైద్యంబుయుద్ధాన ‡ వనరఁజేయ
యుద్ధంపు ఘోరంబు ‡ లున్నవున్నట్లుగా
నాయాంధ్రప్రభయందె ‡ యందజేయ
జాబులురాకున్న ‡ గాబరాపడినేను
నొకరాత్రి సమయాన ‡ నొంటిగాను

తే॥గీ॥ పండుకొన్నను నిద్దుర ‡ పట్టదాయె
అపుడు చూచినదృశ్యంబు ‡ చెపుదునేను
రమ్ము రమ్మయ్య మణిమంది ‡ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ‡ పంతమేల. 67

సీ॥ ప్రక్కగదినినున్న ‡ చుక్కంటిదీపంబు
నేనున్నగదియందు ‡ కానుపించె
కనులను తెరచియే ‡ గాంచుచుంటిని నేను
కలకాదు సుమ్మయ్య ‡ కమలనయన

కవులువర్ణించెను – ఘనశక్తిరూపంబు
కాళ్ళకు గజ్జెలు – ఘల్లుమనఁగ
ఎత్తైనయారూపు – క్రొత్తగానుండఁగ
నాకండ్లయెదుటనే – నాతినిలిచి
మగువ చింతించకు – మరిరేపు జాబందు
నీకఁబోదు నేనని – యింతియనుచు

తే॥గీ॥ చేతులెత్తంగనామెయు – చేతులెత్తి
మాయమయ్యెను ఘడియలో – మధువిరోధి
రమ్మురమ్మయ్య మణిమంది – రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ – పంతమేల. 68

సీ॥ ఇఁకనొక్కమారు నే – నింపుగాఁజూచితి
ఈశక్తి రూపంబు – వింతగాను
నా పెద్దబిడ్డప్పు – నాప్రక్కలోనుండ
చంటిబిడ్డగనున్న – సమయమందు
ప్రక్కలోనున్నట్టి – పసిబిడ్డనెత్తియు
చేతులుకాళ్ళను – చీల్చివైచి
నాయెదురుగతిని – నామోముఁజూచుచు
నదరదు బెదరదు – నాతియపుడు

తే॥గీ॥ ఇట్టిఘోరాలనెన్నియో – యింతిచేసె
తెలియఁజెప్పెదనీచెంత – తేటగాను

రమ్మ రమ్మయ్య మణిమంది ꠏ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ꠏ పంతమేల. 69

సీ॥ ఇంకొక బిడ్డను ꠏ నింతితాపడవై చె
లోతుగానీరున్న ꠏ లోయయందు
గప్పునదూకినే ꠏ చప్పున దెచ్చితి
అడుగువజరుబోయి ꠏ జడియకుండ
కొన్నాళ్ళక్రిందట ꠏ కొమ్మతావచ్చెను
అప్సరసనుబోలు ꠏ నందముగను
నావెంటరమ్మని ꠏ నాతినన్ బిలువంగ
చంటిబిడ్డనువీడి ꠏ యొంటిగాను

తే॥గీ॥ ఎట్లువత్తును చెప్పుమా ꠏ యింతియనిన
నామెచేసిన దౌర్జన్య ꠏ మదియువినుము
రమ్మ రమ్మయ్య మణిమంది ꠏ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ꠏ పంతమేల. 70

సీ॥ చేతిబిడ్డనులాగి ꠏ చేడెకోపముతోడ
విసవిసదూకుచు ꠏ విసరివేసె
మరునాడు లేవంగ ꠏ జ్వరముతోనుండెను
కన్నులు తెరువదు ꠏ కదలదాయె
పాలనిచ్చెదనని ꠏ బాలనోటినిబెట్ట
నార్తితోనద్దాని ꠏ నందుకొనదు

అప్పుడువచ్చెను కోప ఽ మతివమీదనునాకు
నెన్నియంటినొ నేను ఽ నెంచలేను

తే॥గీ॥ దాచకుండంగఁజెప్పెద ఽ దానవారి
తప్పునాదనిచెప్పిన ఽ నొప్పుకొందు
రమ్ము రమ్మయ్య మణిమంది ఽ రానికనిన
పలుక వేలయ్య పరమాత్మ ఽ పంతమేల. 71

సీ॥ నాబిడ్డలందఱు ఽ నీబిడ్డలేగార
మనసన్నదున్నదా ఽ మగువనీకు
దేవతవానీవు ఽ దెయ్యానివా లేక
క్రూరరాక్షసిబోలు ఽ కొమ్మనేమొ
నీవేమిచేసిన ఽ నే నొప్పుదునుగాని
పసివారియందేమి ఽ కసియిదేల
గుమ్మంబునెక్కక ఽ పొమ్మింకనీవని
యుద్రేకమునఁ నేను ఽ నువిదననిన

తే॥గీ॥ కొంతకాలంబు రాదయ్యె ఽ చెంతఁజేర
పొంచిపొంచియుతిరిగెడు ఽ పొలతిఁగంటి
రమ్ము రమ్మయ్య మణిమంది ఽ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ఽ పంతమేల. 72

సీ॥ పెండ్లైనక్రొత్తలో ఽ కండ్లకునగుపడ్డ
వింతయొక్కటి దాని ఽ వినుమునీవు

తెల తెలవారెను ౯ తొల్కోడికూసెను
కావు కావుమనుచు ౯ కాకులరచె
తెరచియుంచెను ౯ తెరదీసికిటికీలు
గాలివచ్చుటకుగా ౯ గడియతీసి
మెలకువ వచ్చిన ౯ మెడయెత్తి చూఁచితి
కిటికికావలనుండి ౯ నటనగాను

తే॥గీ॥ చూచుచుండిన యువిదను ౯ జూచినేను
గడబిడగ లేచి తలుపుల ౯ గడియదీయ
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 7౩

సీ॥ అచ్చటిమెట్లను ౯ నతివదిగుచునుండె
వెంటనేఁ బోవంగ ౯ గంటఁబడదు
గేటుతల్పుల నెట్లు ౯ దాటితా వచ్చెను
నిద్రలోనుండంగ ౯ నెల్లవారు
మూసినతలుపులు ౯ మూసినట్లుండెను
నాశ్చర్యముగ నేను ౯ నంత వెదకి
చెచ్చెరనాగది ౯ చేరెఁడు సమయాన
నాపతిమేల్కాంచి ౯ నన్నునడిగె

తే॥గీ॥ యెచటికరిగితివనగ స్త్రీ ౯ యెవరో తొంగి
చూచినట్లైన వెదకుచు ౯ చూడఁబోతి

రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 74

సీ॥ నలమహారాజును ƒ నలనాఁడు శనిపట్టి
పలుకష్టములకోర్చి ƒ పడినరీతి
ఆ హరిశ్చంద్రుని ƒ నంటుక విడువక
నక్షత్రకుఁడు బెట్టు ƒ నలఁతరీతి
లంకలో సీతమ్మ ƒ రాక్షసస్త్రీలచే
పడరాని కష్టాలు ƒ పడినరీతి
పలుఘోరరూపాల ƒ పడతిదర్శనమీయ
పడరాని కష్టముల్ ƒ పడితినేను

తే॥గీ॥ ఇట్టినాటకమాడెడు ƒ నింతియెవరో
యింకనోర్చెడు శక్తి నా ƒ కింత లేదు
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 75

సీ॥ ఎన్నని చెప్పుదు ƒ కొన్నియే చెప్పితి
వింతలెన్నియొయుండె ƒ వినతిఁజేయ
సంశయంబైనచో ƒ చక్కఁగవ్రాయును
చిత్రగుప్తుఁడువాని ƒ చేతమీరు
చదివించి తరువాత ƒ పదిమందిలోనాకు
న్యాయంబుచెప్పుమీ ƒ యోయనంత

తప్పులుగలవేని § తలవంచినీచేత
శిక్షనుఁబొందెద § తత్క్షణంబె

తే॥గీ॥ వాయిదా వేసి ముందుకు § వంతులేసి
జననమరణాలలోనన్ను § జొనుపవద్దు
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ § పంతమేల. 76

సీ॥ ఒక సంశయంబుండె § నొప్పుగా వినునీవు
కోపంబువద్దయా § కూర్మరూప
మా భారతీయులు § మహిమాన్వితుఁడవని
పూజించెదరు నిన్ను § బుద్ధరూప
మాధర్మశాస్త్రాన § మగువలకుండెను
కట్టుబాటుల వెన్నో § చుట్టుముట్టి
నీపత్ని కోడలు § నిందందె తిరుగంగ
నేననుకొందును § నిజముగాను

తే॥గీ॥ ఆదిమూర్తిని నాతని § యనుఁగుసుతుని
బోలువారెవ్వరుందురీ § భూమిననుచు
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ § పంతమేల. 77

సీ॥ అతివవేషమునైన § నందందు తిరిగిన
మాయాంధ్రకీర్తికే § మచ్చవచ్చు

పడతి వెల్వలఁబోవ ✽ పతియప్పుడదలించు
నిజమెఱుంగఁడుగ్గాని ✽ నిందమోప్ప
తనుజూడదగాడైన ✽ త్రాగుబోతైనను
సతికినీతులుసెప్ప ✽ సాహసించు
నిదియొకధర్మమై ✽ యీలోకముననుండె
కొందఱియందున ✽ కొదువలేక

తే॥గీ॥ ఈ యధర్మంబు మాలోన ✽ నెన్నఁజాల
నాకుఁదోఁచినవిధమిది ✽ న్యాయమేదొ
రమ్మ, రమ్మయ్య మణిమంది ✽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ✽ పంతమేల. 78

సీ॥ మాకవుల్ వర్ణింత్రు ✽ నీకాంత చేరిన
వలచివచ్చెనులచ్చి ✽ వానినను చు
పరులచేఁబట్టిన ✽ పడతినినీవెట్లు
వక్షోనదాల్చెదు ✽ వామరూప
దశరూపములదాల్చి ✽ ధర్మాలనిలిపిన
దైవము తెలియని ✽ ధర్మమేది
గడగడలాడును ✽ కల్గులోకాలన్ని
నిన్నుజూచిన మాత్ర ✽ నీరజాక్ష
యిటువంటి భర్తగా ✽ రిందిరమ్మకునుండ
పరులను జేరంగ ✽ పరువులెదె

తే॥గీ॥ స్వార్థమించుక లేని ప ƒ రార్థమేమొ
తలపమాకది మనసుకు ƒ తట్టదాయె
రమ్మ రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 79

సీ॥ ఇంక నాసుతుగొప్ప ƒ యింతినీకెట్టుల
తెలియుసంచుననీవు ƒ పలికెదేని
ఒకనాటిరాత్రిలో ƒ చెక చెక వచ్చెను
నీకోడలావాణి ƒ నేర్పుకత్తె
పరిచయస్త్రీలాగ ƒ పలుకులఁజెప్పుచు
తెరవంకచూచుచు ƒ నరయుచుండ
ఎవరువారని నేను ƒ నింతినేనడుగంగ
నానాథుఁడేయని ƒ నాతిచెప్ప
ఇంటిలోమొగవార ƒ లెవ్వరులేరమ్మ
మాట్లాడవారితో ƒ మగువయనిన

తే॥గీ వేదవిదులందు గురువుల ƒ వేత్తలందు
అతివగోషాలు లేవని ƒ యామెపలికె
రమ్మ రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 80

సీ॥ అనుచుండ తెరతొల్గ ƒ నాసందులోనుండి
చేతులపుస్తకాల్ ƒ చేర్చిపట్టి

నాల్గుమోములవాడు § నాకంటబడియెను
        చిటికెలోనతఁడప్పు § చెదరిపోయె
కండ్లునల్పుచు లేచి § కడుమోదమందితి
        కలలోనగూడను § గడపదాటి
రానినీసుతుగాంచి § లోనెంచితిని నేను
        బలుగొప్పతరహాయె § బ్రహ్మదనుచు

తే॥గీ॥ బంధుదయమీకు మామీద § ప్రబలియుండ
వచ్చుచుందురు మీరని § మెచ్చుకొందు
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. 81

సీ॥ మాసతీత్వముగన § మీసతీమణులంత
        భారతంబుకురాగ § పాడియయ్యె
వెనుక జరిగినట్టి § వింతనుమరచిరా
        మాసతీ యనసూయ § మహిమగాధ
నారదఋషితోను § బీరాలుపల్కియు
        నత్రిమహాఋషి § యాశ్రమమున
కాలక్ష్మిపార్వతి § యందాలవాణితో
        వచ్చినెగ్గగలేక § కచ్చిగట్టి

తే॥గీ॥ ముగురు మూర్తులనంపంగ § ముద్దుగాను
బాలలనుచేసి యనుసూయ § జోలపాడె

రమ్మ రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ § పంతమేల. 82

సీ॥ అతిథిరూపంబుతో § ననసూయనడిగిరి
యన్నంబు పెట్టమ్మ § యాకలనుచు
పెట్టెదసమయాన § దిట్టలు వీరంత
చీరవిప్పియుఁబెట్ట § నారగింతు
మటుచేయకున్నను § నారగించమటన్న
మగువతలచెనంత § మనసునందు
పరమపాతివ్రత్య § భామనునేనైన
వీరెల్ల బాలురై § వెలయుననుచు
చేతజలముఁబట్టి § శిరములజల్లియు
బుజ్జిపాపలజేసి § భోజనింపె

తే॥గీ॥ చీరవిప్పియె పెట్టెను § చేరదీసి
మాతృమూర్తిగనింతలో § మరచినారె
రమ్మ రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుక వేలయ్య § పరమాత్మ § పంతమేల. 83

సీ॥ చిలిపినారదఋషి § చెంగునతానేగి
మీభార్యలకుఁ జెప్పె § మిమ్ముగూర్చి
అనసూయవడిలోన § నబ్బాయిలైరమ్మ
మీనాథులనుచును § మేలమాడ

కంగారు పడియప్పు ƒ కలహాల పెద్దయా
నారదుసలహాను ƒ నాతులొంది
భూలోకముకువచ్చి ƒ పుణ్యంపుటనసూయ
పాదంబులను తాకి ƒ పతుల నడుగ

తే॥గీ॥ ఎవరిభర్తనువారలే ƒ యెత్తుడనఁగ
నాకరినాథుని నాకరెత్తి ƒ యోడిరయ్య
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 84

సీ॥ మంత్రతంత్రములేవి ƒ మాకు తెలియవైన
మాదేశనీతిలో ƒ మహిమలుండె
సూర్యునినిల్పిన ƒ సుమతియే సాక్ష్యంబు
పతిభక్తిలోనున్న ƒ పట్టుదెలియ
సత్యంబు తప్పని ƒ సత్యహరిశ్చంద్ర
గాథయే భారత ƒ ఘనతదెల్పు
మాదేశవాసుల ƒ మంచినిపరికించి
దేవతల్ తిరుగుట ƒ తేటబడియె
భారతీయులతోటి ƒ బంధుత్వముండుట
మాప్రాతకథలె ప్రా ƒ మాణికములు

తే॥గీ॥ అట్టిమైత్రిని నింకను ƒ గట్టిపఱచ
కంకణముదాల్చి రావయ్య ƒ కరుణతోడ

రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 85

సీ॥ దేవుండవీవని ƒ కావరమ్మించుచు
నిన్నుబిల్చుట లేదు ƒ నిజమునమ్ము
భారతస్త్రీలకు ƒ పతియెదైవంబన
నితరదైవములేల ƒ యెంచిచూడ
తండ్రిగానినుబిల్తు ƒ దైవముగాగాదు
తనయుగా నన్నెంచి ƒ తరలిరమ్ము
మాప్రజల్ తప్పులు ƒ మదినెంచినిలువకు
అందరిశిక్షనే ƒ ననుభవింతు

తే॥గీ॥ నిన్నుజూచిన మీదట ƒ నెంతపాపు
లైన పావనులౌదురు ƒ శ్రీనివాస
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 86

సీ॥ పిలిచిన రాకున్న ƒ చులకనగానెంత్రు
నాదేశవాసులు ƒ నన్నుజూచి
ఇంతధైర్యముగాను ƒ నింతినన్ బిల్చుట
కవిత వ్రాయుటకంచు ƒ కథలుచెప్పి
గుసగుస లాడంగ ƒ పసచెడినామది
పరిపరివిధముల ƒ బాధచెందు

నమ్మినమనసును ✽ నసబెట్టజూచిన
సృష్టికేనష్టంబు ✽ చిత్రరూప

తే॥గీ॥ బాల్యమాదిగ తెలియక ✽ పట్టుబడని
నిన్నెనమ్మితి కష్టాల ✽ నెన్నోబడితి
రమ్ము రమ్మయ్య మణిమంది ✽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ✽ పంతమేల. 87

సీ॥ సానబట్టినగాని ✽ చక్కనిదైనను
వజ్రంబునకునెట్లు ✽ వన్నెవచ్చు
శాశ్వత కీర్తిని ✽ విశ్వమందుననుంచి
యేకోటి కొకరినో ✽ యెంచినీవు
ముప్పుతిప్పలుబెట్టి ✽ గొప్పనుదెత్తువు
నీకున్న గుణమది ✽ నాకుతెలిసె
చిన్నతనమునుండి ✽ కన్నించినామీద
కక్షకడితివయ్య ✽ కపటముగను

తే॥గీ॥ వింతరూపాల జాల్చెదు ✽ విష్ణువీవు
నలతబెట్టంగ మాయను ✽ నంపితౌర
రమ్ము రమ్మయ్య మణిమంది ✽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ✽ పంతమేల. 88

సీ॥ తెలిసికొంటిని నిన్ను ✽ తెలివిలేకున్నను
పడతినైనను నేను ✽ జడియనింక

బాలికగానుండి ఽ బాల్యంబునందున
నేననుకొంటిని ఽ నేర్పుగాను
ఆహిమగిరికేగి ఽ యందుతపముచేయ
బాగనియెంచెనా ఽ జోగిమనసు
స్త్రీనౌటచే నేను ఽ సిరిసంతతుల్ గల
సంసారగుహాలోన ఽ సతిగమెలగి

తే॥గీ॥ సల్పియుంటిని సత్కర్మ ఽ శాంతముగను
ముక్కుమూసియుఁ గూర్చుండ ఽ నెక్కువౌన
రమ్ము రమ్మయ్య మణిమంది ఽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ఽ పంతమేల. 89

సీ॥ మజ్జిగలో వెన్న ఽ మరియంటనట్లుగా
సంసారమందున్న ఽ సతిని నేను
కట్టెలోనగ్నియు ఽ కండ్లకందనిరీతి
తపమునవున్నట్టి ఽ తన్వి నేను
కష్టంబుసుఖమును ఽ నిష్టంబుగా నెంచి
కాలంబుగడపిన ఽ కాంత నేను
నాల్గుగోడలమధ్య ఽ నవ్యంబు నెరుఁగక
నిన్నె నమ్మిన యట్టి ఽ నెలత నేను

తే॥గీ॥ నీకు చెప్పెడిదేమిటి ఽ నిఖిలమెఱిఁగి
సర్వజీవులఁ బ్రోచెడు ఽ సత్యరూప

రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంత మేల. 90

సీ॥ భారత దేశాన ƒ భాగ్యవంతులునుండ
బరువైన బిరుదుల ƒ బంటులుండ
వేలకు వేలుగా ƒ వేదవేత్తలునుండ
పండితశ్రేష్టులు ƒ పదుగురుండ
సర్వజ్ఞలయినట్టి ƒ సఖియ లెందరోయుండ
నిందరందునకొద్ది ƒ యింతినైన
నాయింటబస చేయ ƒ నీయంటివానికి
చిన్నతనంబయ్య ƒ చెప్పనీవు

తే॥గీ॥ గర్వమించుక లేనట్టి ƒ ఘనుఁడవైన
భక్తిధనముకు లొంగెడు ƒ బంధువైన
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంత మేల. 91

సీ॥ ఆకలియనిబిల్వ ƒ దాకొందు వేలయా
లోకపోషక కీర్తి ƒ నీకుతగదు
నీసతీమణియిచ్చు ƒ నిండైనబియ్యంబు
నాయాకలణచదు ƒ నమ్ము నీవు
దాహంబు మెండాయె ƒ ధరనున్న జలమంత
త్రాగిన దప్పిక ƒ తరుగదాయె

నమ్మనీరాకచే ఽ నాయాకలడగును
సంశయంబులుదీర్చి ఽ చక్కనైన
జ్ఞానామృతంబను ఽ పానకంబునునిచ్చి
దాహంబుతీర్చుమా ఽ తత్క్షణంబె

తే॥గీ॥ యెట్టియాహారమైనను ఽ పొట్టనింపు
ఆత్మనిండునుపరమాత్మ ఽ నందుకొనిన
రమ్మ రమ్మయ్య మణిమంది ఽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ఽ పంతమేల. 92

సీ॥ యెన్నెన్నొబిరుదుల ఽ వన్నెకాడవునీవు
అతివనెఁ నాయాక ఽ లణఁచవేని
నీబిడ్డచేసెదు ఽ నిండైన సృష్టిని
మ్రింగివై చెదనేమొ ఽ తొంగిచూడు
ధరలోన ప్రవహించు ఽ ధన్యగంగనునాపి
త్రాగివై చెదనేమొ ఽ తరలిరమ్మ
కోపంబునెఱుఁగని ఽ కోమలాంగినినన్ను
రెచ్చకొట్టకు మింక ఽ పిచ్చివాఁడ

తే॥గీ ముసుగుతొలగించిరమ్మింక ఽ విసుగుకలిగె
కట్టివేసితి నీమాయ ఽ కట్టిపెట్టు
రమ్మ రమ్మయ్య మణిమంది ఽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ఽ పంతమేల. 93

సీ॥ దొంగవునీవను ౹ బంగరుపల్కులు
నేటికర్థములాయె ౹ తేటగాను
నిన్ను నమ్మినప్రాణి ౹ మిన్నగా నెంచెదు
నిష్టార్థమంతయు ౹ నష్టపఱచి
దోచివేతువుగదా ౹ దొంగలాగునసీవు
నినునమ్మటే గొప్ప ౹ నేరమందు
జరిగినదానికి ౹ జగడంబులేలయా
మఱిమఱిదెప్పెదు ౹ మగువగాను

తే॥గీ॥ ఇవియుమనసుననిడుకొని ౹ యింటికరుగ
తన్వి మన్ననలేదని ౹ తలచవలదు
రమ్ము రమ్మయ్య మణిమంది ౹ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ౹ పంతమేల. 94

సీ॥ చెప్పుమరచితయ్య ౹ గొప్పవిషయముండె
మణిమందిరముౘ్రాయ ౹ మనసునందు
కోర్కెగల్గిన నాడు ౹ కొమ్మయెవర్తొవచ్చి
కలలోన విందైన ౹ కాంతిబోలు
చంటిబిడ్డనునాకు ౹ చనవుగా నందీయ
చేతదీసుకనేను ౹ కౌతుకముగ
నాగుండెకద్దుచు ౹ నాతినంకనుజూడ
బాలునిసైగతో ౹ భామజూడ

తే॥గీ॥ బాలుడప్పుడుశ్లోకాల ꠂ పాడెనీదు
లీలలన్నియు నెఱిగితి ꠂ గోలనయ్యు
రమ్మ రమ్మయ్య మణిమంది ꠂ రానికనిస
పలుక వేలయ్య పరమాత్మ ꠂ పంతమేల. 95

సీ॥ అందున్న భావంబు ꠂ లన్నియునెఱిగితి
పరవశంబయ్యెను ꠂ భావమందు
ప్రక్కకు తిరుగంగ ꠂ పడతిగానఁగరాదు
నివ్వెర పడినేను ꠂ దవ్వునందు
మంచంబుమీఁదికి ꠂ దించియుపాపను
ప్రక్కనుపడుకొని ꠂ పాలునిచ్చి
నిదురబుచ్చినమీఁద ꠂ నిదురఁబోతిని నేను
దానియర్థము చెప్ప ꠂ దాచకుండ

తే॥గీ॥ చిత్రలీలలు భారత ꠂ స్త్రీలకిట్లు
చూపుచుందువ యందఱు ꠂ చోద్యమొంద
రమ్మ రమ్మయ్య మణిమంది ꠂ రాని కనిస
పలుక వేలయ్య పరమాత్మ ꠂ పంతమేల. 96

సీ॥ పలుకవుపిలువఁ నీ ꠂ పాలనంబేలయ్య
నిండైన బిరుదుల ꠂ చెండుగట్టి
పాలసంద్రమునందు ꠂ పారవేయుమునీవు
శంఖచక్రగదల ꠂ చక్కవీడి

గరుడునివదలుము § గగనంబులోనికి
నాగరాజునువీడ § న్యాయమౌను
వేగంబె దిగుమయ్య § విలువైననీసీటు
మంచివారేలంగ § మించిపోరు

తే॥గీ॥ లేనిగొప్పలుపొగడెదు § లేమగాను
నున్నదంటిని నలుకేల § నులుకదేల
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. 97

సీ॥ గడచినజన్మల § కర్మలన్నియుఁగల్పి
నూరేండ్ల వారొందు § యోర్పునిచ్చి
ముప్పదేడులపైగ § తిప్పలుఁబెడితివి
నిలుపుము చాలించు § తులవతనము
మాకవుల్ మాటలు § మదికివచ్చెను నేడు
కృష్ణావతారంబు § కీటుకు తెలిసె
పొగడుచుండిన నిన్ను § పొంగిపోవుచునీవు
రక్షింపబూనెదు § రాజువనుచు

తే॥గీ॥ తెలిసికొనియును నేవట్టి § తెలివితోడ
పిలువజాలంగనేరని § కలికినేను
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. 98

సీ॥ విసిగియుండుటచేత కసరుకొంటినిగాని
భక్తినీపై లేని భామగాను
ఏమేమి యంటినో యెంచి కోపించక
మన్నించియపియన్ని మరచిపొమ్ము
దేవనేగంటిని దేవకాంతలునన్ను
మారురూపంబుల మాయఁజేయ
నాయింటిచుట్టును నటనగాదిరిగియు
దొరికిపోయిరిసుమ్మ పరువుపోగ

తే॥గీ॥ క్రొత్తలేదయ్య సిరికిఁ నీ కోడలికిని
వారితోగూడనీరాక వన్నెకెక్క
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 92

సీ॥ మత్స్యావతారుఁడా మర్యాదఁజేసెద
కూర్మావతారనిన్ కొలుతునెపుడు
వరహావతారుఁడా వరములనీవయ్య
నరసింహానికిదె నతులఁజేతు
వామనరూపుఁడా వందనంబులునీకు
రామావతారుఁడా రమ్మురమ్ము
పరశురాముఁడనీకు ప్రణతుల నర్పింతు
బలరామకృష్ణాఖ్య భక్తిఁజేతు

బుద్ధావతారుఁడా ƒ బోధ చేయుము నాకు
కల్క్యవతారుఁడా ƒ కావరమ్ము
తే॥గీ॥ శ్రీమహావిష్ణురానయ్య ƒ శీఘ్రముగను
మగువమణియమ్మ పిలుపిది ƒ మరాన మేల
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంత మేల. 100

## ఫలశ్రుతి

సీ॥ ఎనుబదిపద్యాల ƒ నెలమిఁ వ్రాసియు నేను
పుస్తకంబును నెట్లు ƒ పూర్తిఁ జేతు
ననుచు దలఁచుచుండ ƒ నారాత్రియందున
నిదురబోతిని మది ƒ కుదురు లేక
వనితయొక్కతె వచ్చి ƒ వ్రాసిన నాపొత్త
మెత్తు చుకలముతో ƒ మెల్లగాను
వ్రాయుచుండిన నేను ƒ వనితతో నిట్టులంటి
నా పుస్తకంబందు ƒ నాతి నీవు
తప్పులు వ్రాసెదు ƒ తరువాత నేదాని
దిద్ద లేననుచును ƒ పెద్దగాను
తే॥గీ॥ కసిరి నే పల్క హాసంబు ƒ కనులఁదోప
పడఁతి పండితురాలనై ƒ పరగితీవు
నేను వ్రాయంగ నచ్చునా ƒ నీకనుచు
చిన్నసగవున నన్ గేలి ƒ చేసె నామె 101

తే॥గీ॥ అట్టిభారతి యమృతపు ౯ హాస రేఖ
భక్తినీగ్రంథపాఠక ౯ ప్రజలయందు
నిల్చివిద్దెలయందున ౯ నేర్పునిచ్చి
ప్రోచుచుండును సతతంబు ౯ పొలుపుమీర 102

కం॥ మణిపూర్వపు తపమున నే
మణిబాహ్యపు దృష్టియందె ౯ మాధవుగాంచెన్
మణిమనసు మందమెఱిగియె
మణియమ్మకు కాళిమాత ౯ మాటలునేర్పెన్ 103

కం॥ మణులనునిటికెలవాణియె
మణియమ్మకు నాకునీయ ౯ మక్కువతోడన్
మణిమందిరంబు కట్టితి
మణిగొప్పనుపొగడకండి ౯ మఱిమఱి మీరల్ 104

కం॥ మణిమందిరంబు చదివిన
మణిమందిర మందునున్న ౯ మర్మముగనినన్
మణిమందిర వాసుండగు
ఫణిశయనుఁడు మీకునిచ్చు ౯ పలుభోగములన్ 105

కృష్ణార్పణమస్తు

సంపూర్ణము




సీ॥ అయిదేసుల ప్రాయ మబలనై యుండంగ
పందిరి మంచంబు పరుపుపైన
మానాన్న యొద్దను మక్కువమాటలు
పలుకుచు దొర్లుచు పరుపుచివర
వఱకువచ్చియు నేను వంగిచూడగ క్రింద
పడగవిప్పిన పాము పడకగాఁగ
కీవి పరుండిరియె నావైపు చూచుచు
నాపాయ మొదవగా నవ్వలేద

తే॥గీ॥ మరతు నెట్టుల యాదృశ్య మహిమ నేను
అట్టి దయ నేడు నామీద నంతరించె
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ పంతమేల. 10

సీ॥ నాన్న చూడుము వంగి కొ నాగరాజుండెను
దానిపై విష్ణువు కొ దనరు చుండె
అనఁగ మానాన్నప్డు కొ కనులతో నిన్ గాంచ
త్రొంగిచూడఁగ నీవు కొ దొంగవోలె
దొర్లక వుకాని నే కొ మరిమరి చూడంగ
అట్టులేనాకండ్లు కొ కగుపడంగ
నామాట నిజమని కొ నమ్మింపఁ గలనయ్య
జడిసితి ననిదృష్టి కొ వడిగదీసి॥

తే॥గీ॥ భయములేదమ్మ యనుచును కొ దయగనన్ను
నిద్రబుచ్చిరి నామాట కొ నిజముకాద
రమ్మి రమ్మయ్య మణిమంది కొ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ కొ పంతమేల. 11

సీ॥ నేను చూచినరూపు కొ నిజముగా వర్ణింతు
కాదేని నామాట కొ కల్లగాద ?
తెల్లనికాంతులు కొ చల్లంగ వెదజల్ల
దంతంబుఁ బోలిన కొ ధవళవర్ణ
తలనాను నొక చేయి కొ తలగడగా నుండ
పాము పడక గాగ కొ పవ్వళించి
విరివైన కన్నులు కొ విప్పిచూచిన చూపు
చొప్పల మరువను కొ నిప్పుడైన

తే॥గీ॥ చూచియుంటిని నీదగు ǂ చోద్యరూపు
మరువలేదయ్య యదిచెప్ప ǂ మదినినుండు
రమ్ము రమ్మయ్య మణిమంది ǂ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ǂ పంతమేల. 12

సీ॥ నీలవర్ణుఁడవంచు ǂ నీచాయ పొగడెదు
కథలును చిత్రాలు ǂ కలవు భువిని
నేను చూచిన తీరు ǂ నీలవర్ణముగాదు
తెల్లని చాయయే ǂ కల్లగాదు
ఏదినిజమొఁయంచు ǂ నేదియుఁదోచక
సంశయాలెన్నియొ ǂ చంపుచుండ
సదయహృదయుడవు ǂ సజ్జనప్రియుడవు
నీనోట వినగనే ǂ నిన్నుఁబిలువ

తే॥గీ॥ ఎరుగనట్టులెయుందువు ǂ కరుగరాని
కఠినతరమైన మనసని ǂ కంటినౌర
రమ్ము రమ్మయ్య మణిమంది ǂ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ǂ పంతమేల. 13

సీ॥ స్థూలదృష్టిని నిన్ను ǂ చూడంగ జాలిన
నేనెంత ధన్యనో ǂ నీవెచెప్పు
స్వప్నంబులందు నీ ǂ చక్కని లీలలు
గనియుంటి నెన్నియో ǂ ఘనతమీర

అదియొక్కటైన నీ ƒ మదినుండెనో? లేదో
యెఱిగింతునిప్పుడైన ƒ మఱపుపోవ
ఇంతటిమఱపున్న ƒ నింతగాసృష్టిని
పాలించుటెట్లయ్య? ƒ పరమపురుష

తే॥గీ॥ నటన పరుడవు నీవని ƒ నాకుఁదోచె
నిన్ను నమ్మితి నింకైన ƒ నన్నుఁబ్రోవ
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 14

సీ॥ లెక్కకలవి కాని ƒ చుక్కరాల్ గలయట్టి
శకటమొక్కటిబోవు ƒ శరమువోలె
ఒంటరిగానేను ƒ నొకచోట కూర్చుండి
దిక్కుతోచక యుండి ƒ వెక్కియేడ్వ
శంఖ చక్రగదల ƒ శాంతముగాఁదాల్చి
నాల్గవ చేతితో ƒ నన్నుతట్టి
భయము లేదనుచును ƒ నయమున చెప్పంగ
నలుదిశలను జూచి ƒ కలువరమున

తే॥గీ॥ ఒకరి ప్రక్కను నొకటిగా ƒ శకటమంత
నీదురూపాలె కనుపించె ƒ నిజము కాద
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 15

సీ॥ ఇట్టి స్వప్నములన్ని ƒ గట్టిగా నుడివిన
పిచ్చిదానిగ నన్ను ƒ పిలుతువయ్య
నీవుమఱచితంచు ƒ నేఁ జెప్పితిని గాని
చెప్పకూడదు సుమా ƒ గొప్ప కొఱకు
దేవనీచూపులే ƒ యేవేళ నావెంట
నున్న వైతోచు నా ƒ కన్నులకును
వేచపడ్డైనను ƒ తోచకుండగ జూతు
నీవువచ్చితివేమొ ƒ నేటికనుచు

తే॥గీ॥ మక్కువన్నది యుండగ ƒ చక్కరాగ
జరుగుగౌరవ మూమీద ƒ జరుగఁబోదు
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 16

సీ॥ ఒకవంక జననియు ƒ నొకవంక నీవును
నన్ను శోధించుట ƒ న్యాయమేన
సృష్టిలో నెందఱో ƒ పుష్టితోనుండంగ
పడితినొ నామీద ƒ పంతమేల
అడుగడుగున నాకు ƒ కడుపరీక్షలు బెట్ట
భారంబుగా నేను ƒ బాధపడుదు
రక్షించు వారలే ƒ శిక్షింపఁ జూచిన
కరుణతో నన్ గాచు ƒ ఘనులుకలరె

తే॥గీ॥ అడుగుచుంటిని నిన్నునే § బడలియుండి
కష్టపెట్టకు నన్నింక § కపటధారి
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. 17

సీ॥ నడచివచ్చెదవేమొ § గడబిడగానీవు
గరుడుని నెక్కియే § కదలిరమ్ము
ఒంటరిగావద్దు § జంటగానేరమ్ము
మాయమ్మతోడనే § డాయరమ్ము
శంఖ చక్రాల్ వీడి § చక్కవచ్చెదవేమొ
చేతదాల్చిన తరు § వాత రమ్ము
ఆదిశేషునిబాసి § యట్లె వచ్చెదవేమొ
యతనితో వచ్చిన § నందమగును

తే॥గీ॥ ఏవిలేకున్న నిన్నెట్లు § దేవుఁడనుచు
తెలియగలనయ్య నాకంత § తెలివిగలదె
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. 18

సీ॥ దేవతాగణముల § దీవింప రమ్మను
బ్రహ్మదేవుని బిల్వ § పత్నితోడ
అన్నిటియందును § మిన్నగానినుఁజూచు
గౌరిశివులఁ బిల్వ § గట్టిగాను

వారిపజ్జననుండు ౯ వీరుండుమఱిగుజ్జు
గణపతిఁ పట్టుక ౯ కట్టితెమ్ము
నందికుమారస్వామి ౯ నందఱ రమ్మను
ఘనుకుబేరుని వెంట ౯ గొనియెరమ్ము

తే॥గీ॥ వీరినందఱిఁ బూజించి ౯ నేరుగాను
మనవిఁజేతును సంశయాల్ ౯ మనసువిప్పి
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 19

సీ॥ మన్మథుఁ బిల్పుట ౯ మరచిపోకుముసుమా
చిత్రగుప్తునిఁ గూడఁ ౯ జేర్చి తెమ్ము
ఇంద్రలోకపురాజు ౯ నింతితోరమ్మను.
మా బృహస్పతి గురుం ౯ డతనిఁ గూడ
వీరువారని చెప్ప ౯ భారమాయెను నాకు
నందున్న వారల ౯ నిందు తెమ్ము
రాజుగానీవుండ ౯ మోజుగానీచుట్టు
తీర్చిన కొలువు క ౯ న్నార్చకుండ

తే॥గీ॥ కఱవుదీరంగ జూచెదు ౯ ఘడియయెపుడో
యనుచు నామది తహతహ ౯ లాడుచుండె
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 20

సీ॥ ఇంతమందినిఁ బిల్చి | యింతితా నేగతి
నాతిథ్యమీఁగల | దందు వేమొ
నాతండ్రి లోకాల | నాథుఁడై యుండంగ
నాకేమి కొదువ భూ | లోకమందు
అన్నియు సమకూర్చు | నమ్మ నాకుండంగ
వారికి మర్యాద | భారమౌనె
చేదోడుగా నుండ | చిన్నారి గణపతి
పనులెల్లఁ గావను | భయము దేల

తే॥గీ॥ యమరకాంతలు నన్నెప్డు | నాదరింత్రు
జరుగు పనులెల్ల వారలే | జరుపఁగలరు
రమ్ము రమ్మయ్య మణిమంది | రాని కనిన
పలుక వేలయ్య పగమాత్మ | పంత మేల. ౨౧

సీ॥ మారురూపులఁ దాల్చి | మీరు రాకుడు సుమా
మర్యాద జరుగదు | మాట లేల
వచ్చు మందర నాకు | కచ్చితంబుగఁ జెప్పి
గణపతితో మీరు | కబురు పెట్టు
వాకిళ్లు కడిగియు | నట్టింట ముగ్గుంచి
గుమ్మాల పసుపుకుం | కుమలు పెట్టి
మామిడి తోరణాల్ | మంటపమ్ము కట్టి నే
చిరుచాపలన్నియు | పరచియుంచి

మద్దెరుసీకొక | గద్దెను గట్టింతు
నమ్మకు నీకును | నదియె చాలు

తే॥గీ॥ ఇట్టులున్నట్టి నాయూహ | గట్టితనము
వమ్ము చేయక నన్నింక | వంతలిడక
రమ్ము రమ్మయ్య మణిమంది | రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ | పంతమేల. 22

సీ॥ కైలాస వాసికి | కాంతతో సరిపోవు
కల్పపీఠంబేతు | ఘనతగాను
నిండైనపీఠంబు | నీపుత్రునకువేతు
చదువులరాణితో | చాలునట్లు
మూర్తులుముగ్గురు | ముచ్చట్లు చెప్పుచు
సొక్కుచో కూర్చున్న | చక్కదనము
చిరుచాపలకునిండ | వరుసగాకూర్చున్న
దేవతాబృందంబు | తేజమంత

తే॥గీ॥ భక్తినేచూడజాలెదు | శక్తినిచ్చు
భారమంతయునీమీద | భద్రపఱతు
రమ్ము రమ్మయ్య మణిమంది | రాని కనిన
పలుకవేలయ్య | పరమాత్మ | పంతమేల. 23

సీ॥ రత్నఖచితమైన | రంగైన పీఠాలు
వేతునంచును మీరు | చూతురేమొ

గొప్పలుసెప్పంగ • చప్పగా నుండును
నాకుఁగల్గినవేమొ • మీకువేలు
ఎరువుసొమ్ములు తేఁగ • పరువు పోవునుగదా
నీకు తెలియనిదేమి • నిఖిల జగతి
నాయింట నడుగిడు • నాల్గుచేతులసామి
యనఁగ నవ్వేదరయ్యా • యపుడెవారు

తే॥గీ॥ ఓరచూపును జూడక • యోర్చుకొనుము
నేరమెంచక ననుకడు • గారవించి
రమ్ము రమ్మయ్య మణిమంది • రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ • పంతమేల. 24

సీ॥ మేమంత వచ్చిన • భామనీ వొకతెవు
మరియాదలెట్టులు • జరుపఁగలవు
అనుచు నడిగెదేని • యానదిచెపుదు నా
పతియుబిడ్డలుగూడి • పాదసేవ
మీయందఱకుఁజేసి • మీచేత దీవనల్
మేమంతపొంద మా • మేలుగాను
శాంతంబుగావిను • చక్కనిభావంబు
నామదినిండుగా • నణఁగియుండె

తే॥గీ॥ ఎపుడు వచ్చెదవంచు నే • నెదురుసూతు
కదలిరావేల యింకనైన • కపటముడిగి

రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ పంతమేల. 25

సీ॥ దేవదేవేశనిన్ దీననై వేడుదు
నామొర విననీకు న్యాయమకాను
మానవులెల్లరు కానఁజాలని యట్టి
పరమాత్మ నాయింట పదమునిడఁగ
నాకండ్లతోఁ జూచి నాజన్మ తరియింప
స్వార్థంబు కోరిన సతియునౌదు
సాటిమానవులెల్ల సంతోషచిత్తులై
నిన్నుజూచినఁ గదా నిండునాకు

తే॥గీ॥ మాటనీయుము నాతండ్రి మనసులోని
కోర్కె చెప్పితి నేనని కోపపడక
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ పంతమేల. 62

సీ॥ కథలెన్నొ కలవయ్య కల్పనల్ నీమీద
కవులెట్లు వ్రాసిరో కానఁజాల
మూఢజనులు నిన్ను గాఢంబుగానంద్రు.
దొంగవు వ్యభిచారి దొరవటంచు
అవియన్ని నిజమైన దివినుండి దిగవద్దు
నిన్నుఁబూజించెడు నేర్పులేదు

రక్తమాంసపు దేహ § రమణినే నేనైన
మనసు నిబ్బరమున్న § మగువనేను

తే॥గీ॥ తప్పులను బాపి మదినిల్పు § ధర్మచింత
తెలివిలేనట్టి ప్రజలకు § తెలియఁజెప్ప
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. 27

సీ॥ నేనుజెప్పెడుమాట § నిజమని నమ్మరు
లోకులెల్లరు మాల § కాకుబోచు
త్రాగి జూదముకూడ § తప్పకాదెదవంచు
నిందమోపెదరింక § నిక్కముగను
జాలంబుచేయకు § చాలుబెట్టునుపిడి
పరుగు పర్వున వచ్చి § ప్రజలనేలు
మరచిపోతిని సుమా § పరుగునరాపద్దు
వేషభాషలతోనె § వేగరమ్ము

తే॥గీ॥ డాబులేకున్న నెవ్వరు § డాయరయ్య
లెక్కచేయరు నీమాట § నొక్కటైన
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. 28

సీ॥ మణియమ్మ పిలిచెను § మరిమరినన్నెమొ
తనజీవితంబాక § దరినిఁజేర్చ

అనుచుఁ దలఁతువేని నదియును సరికాదు
సత్కర్మయను నౌక సరిగనెక్కి
కర్మలన్నియు దాటి కడకునీదరిచేర
కష్టమైనను గాని నష్టపడను
కష్టంబుదీర్పంగఁ గాంత పిల్చెనటంచుఁ
గలనైన నెప్పుడు తలఁచవద్దు

తే॥గీ॥ తండ్రికైనను లోకాల తండ్రికైన
మనసు విప్పుచు చెప్పెడు మగువకాను
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 29

సీ॥ కలియుగప్రజలెల్లఁ గట్టుబాటులఁదప్పి
ధర్మమార్గమునుండి తరలిరయ్య
తప్పని చెప్పంగ చెప్పులుదీతురు
పాపమన్నది లేదు భయములేదు
వారిజాక్షుఁడెకాక దారిజూపెడు వాడు
మరియెవ్వరని నేను మదిని తలచి
నిన్నుపిలుచనన్ను నీవెవ్వరనుచును
ఆడిగెదవని నేను నదియుసెపితి

తే॥గీ॥ అంతియేగాని సంసార వంతలెల్ల
చెప్పిరక్షింపఁబిల్చిన చేడెగాను

రమ్ము రమ్మయ్య మణిమంది ర్రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ప్పంతమేల. 30

సీ॥ వైకుంఠవాసుండు వచ్చును రండన
పదుగురు చేరరా పందిరేయ
ఆదిలక్ష్మియు వచ్చు ననుచుఁదెల్పగనేను
అలికియు ముగ్గంతు రతివలంత
గణపతి వచ్చును కదలి రండనగానె
చిన్నారిబాలలు చేరరార
పరమాత్మ కిత్తుమ పాలను తెండన
పాలకుండలనెన్నో పట్టితేర

తె॥గీ॥ పండ్లు తెమ్మని చెప్పంగ పరుగు లిడుచు
నంగడులనున్న వన్నియు నపుడె తేర
రమ్ము రమ్మయ్య మణిమంది ర్రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ప్పంతమేల. 31

సీ॥ నోటిమాటను జెప్ప పాటిసేయరుసుమా
కలియుగప్రజలన్న ఘనులుగారె
చిత్రగుప్తునితోడ చిట్టాను తెమ్మను
ఎవరివి వారికే యెరుకచేయ
ఇదియేమి పన్నులని విసుగుజెందకుసుమా
నీవుగాకున్నను నిప్పులెవరు

సరిచేయగలరయ్య § సమమైన బుద్ధితో
ధర్మంబుస్థాపించు § ధన్యులెవరు

తే॥గీ॥ కష్టపడవద్దు నాప్రక్క § ఘుడియనీవు
నిలిచియుండిన నేఁజేతు § నీదుపనులు
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ § పంతమేల. 32

సీ॥ కాలంబు మారెను § జాలంబుచేయక
ధర్మంబు పాలింప § తరలిరమ్ము
విసిగించితిని నేను § కసరుకొనకుము నీ
కరుణయుండిననాకు § కల్గుసుఖము
అర్జును ప్రక్కన § నండగా నీవుండి
జరుగు కార్యములన్ని § జరుప లేద
యట్టివిధముగానె § గట్టిగా నాప్రక్క
నిలిచియుండినఁజాలు § నేనె సేతు

తే॥గీ॥ యతివనని మాటత్రోయక § యబలననక
యాత్మరూపంబు సమమను § నాదిమూర్తి
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ § పంతమేల. 33

సీ॥ నాప్రక్కనీవుండ § నర్థులతో నేఁజెప్ప
నానాను నమచూస § నాస్వాదరింత్రు

దైవబలము లేక § ధరలోన నేపనుల్
జరుపంగఁ జాలరు § జయముగాను
నామదియందున § నదివలె ప్రవహించె
వర పవిత్రంబను § వరదయొకటి
కట్టువారలు లేరు § పట్టువారలు లేరు
పొంగి పోవుచునుండె § నింగివరకుఁ

తే॥గీ॥ గట్టు కట్టంగఁ జాలిన § ఘనుడవీవు
నదిని బాటించ లోకాలు § పదిలమొంద
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ § పంతమేల. ౩౪

సీ॥ నీవు చేసెడి పనుల్ § నేచేసి పెదమను
శ్రమ పెట్టజాలను § శాంతమూర్తి
తండ్రిగా నీవుండు § తగు పీఠమందున
నీపాదముల చెంత § నిలువబడియు
నీమాటగాఁ జెప్ప § నీతల నూపుము
అదియె చాలును నాకు § నధికమేల
మానవులందున § మర్మంబుఁ జూపెదు
దేవతల్ లోపాలఁ § దెలుపవలయు

తే॥గీ॥ లోకజనకుఁడ భేదంబు ౯ నీకు తగదు
కర్మలన్నియు బాపినన్ ౯ గాచుకొరకు
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 35

సీ॥ గణపతి పనులను ౯ కట్టువారే లేరు
ముందెవ్రొక్కఁ కయున్న ౯ చిందులేసి
ఎంతేసి పనులైన ౯ పంతానచెరచును
వానినెదుర్కొను ౯ వారలెవరు
అమ్మతోఁజెప్పిన ౯ నయ్యతో చెప్పిన
అల్లరి విడచునా ౯ యలుకవచ్చు
పిల్లలఁ పెంచుటే ౯ తల్లులు బరువని
కటకటంబడునట్టి ౯ కాలమందు

తే॥గీ॥ బొజ్జగణపతికెవ్వరు ౯ బూరెగారె
వండిపెడుదురు చెప్పు మీ ౯ దండిగాను
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 36

సీ॥ మన్మథుతప్పుక ౯ మందలించుము సుమా
మర్యాదయన్నను ౯ మరచియుండె
పార్వతీనాథుండు ౯ భస్మంబుచేయంగ
రతికంటి నీటిచే ౯ బ్రతికియుండె

నాతుల ముందర ౹ కోతిలాగున దూకి
విడుచు బాణాలకు ౹ విలువలేదు
మెత్తనివారల ౹ మొత్తుచుండెనుగాని
వీరనారులుగల ౹ భారతాన

తే॥గీ॥ మరల భస్మంబె యాయెనా ౹ తిరుగులేదు
మితముగానుండి యింక మీాద ౹ బ్రతుకుమనుము
రమ్ము రమ్మయ్య మణిమంది ౹ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ౹ పంతమేల. 37

సీ॥ బీగాలు వేసి కు ౹ బేరుండు దాచును
సాధనరాసుల ౹ యర్థమేమి
మాకున్న కొద్దిలో ౹ మాకిచ్చికోలుతుము
మీా కుబేరుండట్లు ౹ మాకునీడు
మాపాలనమువచ్చె ౹ మా సంఖ్య పెరిగెను
ద్రవ్యంబుచాలదు ౹ ధరలు పెరిగె
ప్రభువులు ప్రజలందు ౹ పావలాల్ బేడలు
ప్రోగు చేతురుగాని ౹ పొంక ముగను

తే॥గీ॥ దాడిచేయంగ మాామీాద ౹ ధైర్యమేది
భరతదేశంబునందట్టి ౹ పట్టుదప్పె
రమ్ము రమ్మయ్య మణిమంది ౹ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ౹ పంతమేల. 38

సీ॥ రఘుమహారాజప్డు * రణభేరి మ్రోగించ
నాకుబేరుండంత * నడలిపోయి
ధనరాశి కురిపించి * యినవంశ తిలకుని
కోశగృహంబులో * కొల్లచేసె
పిరికివారినిఁ జేసి * దరికిరానీయక
మావారి నాడించ * మంచిదాన
కలిమాయ చేవీరు * ఘనతకెక్కరుగాని
పౌరుషహీనులే * భరతజనులు

తే॥గీ॥ అట్టి కలిమాయ తరుమంగ * గట్టివాడ
వీవెగాకున్న నేర్పరు * లెవర యనుచు
రమ్ము రమ్మయ్య మణిమంది * రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ * పంతమేల. 39

సీ॥ మాపూర్వులందఱు * నేప్రొద్దు మీకును
క్రతువులతోడను * ఘనతగాను
పూజలు చేయుచు * పుణ్యంబుకోరకని
భక్తితో మీకాళ్ళు * పట్టలేద
ఇప్పటినేరాల * నెంచెదరేగాని
మావారుచేసిన * మంచిగనరు
మానవులనునెల్ల * మంత్రముగ్ధులఁ జేసి
తోలుబొమ్మలలాగు * తోలుచుంఁ

తే॥గీ॥ దేవతలయందె కపటంపు భావముండ
నరులసంగతి యననేల న్యాయపరుఁడ
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ పంత మేల. 40

సీ॥ కోటిలో నొక్కఁడు కూటియాశను వీడి
తపము చేసెదనంచు తలఁచుకొనియు
సంసారమును రోసి సంపాదనను వీడి
అన్నియు విడిచి స న్యాసియగుచు
దట్టంపుటడవిలో ధైర్యంబుతోఁ జొచ్చి
ధ్యానంబు దాల్చియు తపము సేయు
నాయింద్రుడంపును నప్సరోరత్నాల
మేనకోర్వశులను మానినులను

తే॥గీ॥ పెద్దతరహాలు గలవయ్య పెద్దలకును
సమముగా చెప్పనీనోట సత్యమరసి
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ పంత మేల. 41

సీ॥ ఇంక నీకోడలు బింకాలు దెల్పెద
యాబ్రహ్మ పత్నిదా యాగడంబు
వంటయిల్ విడువదు యొంటరిగానున్న
నొప్పక యొకపని నొప్పఁ జెప్ప

అయిదేండ్ల బిడ్డను ॥ నయ్యావారదలించి
చెవిబట్టికొట్టుచు ॥ చెప్పురీతి
బెదరించి లాలించి ॥ కదలించినన్నెమొ
కలముఁబట్టించుచు ॥ కనులజూచు

తే॥గీ॥ తప్పులున్నను చెప్పదు ॥ దాపుఁజేరి
కవులునవ్వర చెప్పుమా ॥ కరుణతోడ
రమ్ము రమ్మయ్య మణిమంది ॥ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ॥ పంతమేల. 42

సీ॥ ఎప్పుడు చూచిన ॥ నిక్కడెయుడుంను
అత్తను మామను ॥ నదడుకొనగు
పదినిముసంబులు ॥ పతిసేవఁజేయదు
నీసుతుండా బ్రహ్మ ॥ నిందునుండ
నాతరపునసీపు ॥ న్యాయంబునడిగిన
నెఱజాణతో నీవు ॥ నెగ్గలేవు
నీయెదుటనెపెట్టి ॥ నిజముఁజెప్పించెద
నాతిపెట్టుచునుండు ॥ నలఁతలన్ని

తే॥గీ॥ సర్వవిద్యలు నేర్పిన ॥ సఖియలుండ
ఏమితెలియని నన్బట్టి ॥ యేపుచుండె
రమ్ము రమ్మయ్య మణిమంది ॥ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ॥ పంతమేల. 43

సీ॥ నీపత్ని నాతల్లి ƒ నిండైనయిల్లాలు
ఆలచ్చిసంగతి యరసిచూడు
తెఱ్ఱునవచ్చును ƒ దూగుటుద్యోల్లనూపు
చిఱ్ఱున నంతలో ƒ చెదరిపోవు
తెలివితక్కువవారు ƒ కలవంటి దనుకోక
విఱ్ఱవీగుచునుంద్రు ƒ వెఱ్ఱితనము
ఆయహంకారంబు ƒ నతివతానోర్చునా?
యంతవచ్చినత్రోవ ƒ నాపెపోవు

గీ॥ ఇట్టిచిక్కులఁబెట్టెదు ƒ నిందిరమ్మ
ఇంకనాదరినుండెదు ƒ విధముఁజెపుదు
రమ్మ రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 44

సీ॥ నేనన్న నిష్టంబు ƒ నీప్రాణసతికది
నిజముకాదోయామె ƒ నీకెజెప్పు
లక్ష్మివారమునుండి ƒ లక్ష్యంబుగానుండు
శుక్రవారపురాత్రి ƒ సొంపుజూపు
నీడగానావెంట ƒ జోడుగానుండును
పుటికనాచేనుండఁ ƒ బూలుగోయు
నగలతో నగరుతో ƒ సొగసైనపూలతో
పూజించనాతల్లి ƒ పొంగుచుండు

తే॥గీ॥ ఇట్టిచిత్రంబులెన్నియో § యింకనుండె
నీవుగమనించనాతల్లి § భావములను
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల 45

సీ॥ ఒకశుక్రవారాన § నొప్పుగాఁబూజించి
తలుపులుమూయకే § యలుపుతోడ!
పడుకొన్న నాకంత § పట్టెనునిదురపై
వనితయెవ్వరోనన్ను § వచ్చిలేపి
వాకిలితెరచి యే § భామనిద్రించెదే!
యనిలేపనేనంత § నామెఁజూచి
తాంబూలమిచ్చెద § తల్లిగైకొనుమన్న
పువ్వులియ్యనయంచు § నవ్వుచిట్లు
గేటుకావలయుంచి § గోటుగాననుగాంచి
మరియాదచేసెదె § మగువయనిన

తే॥గీ॥ వీధిలోనికిఁజోరవతో § వెడలనైతి
నన్నుక్షమియించు మిదియొక § న్యాయమంటి
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. 46

సీ॥ నీసతిలోనున్న § నిజమైనగుణములఁ
గనిపెట్టఁజాలెదు § ఘనులులేరు

శివముగానుండదు | సిరియని మానవుల్
కథలుగాఁజెప్పాట | కలముగాని
నిజముగానాతల్లి | నివసించుయోగ్యత
మదినెంచిచూచిన | మాకు లేదు
సత్యంబుశీలంబు | సరిహద్దుదాటని
వారలచెంతని | వాసమాను

తే॥గీ॥ చేయు పైచూపులకునామె | చెడ్డవారి
కడనెయున్నట్లు దోచును | కలుషహారి
రమ్య రమ్యమయ్య మణిమంది | రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ | పంతమేల.

సీ॥ జూదరుల్ చెంత నే | జోడుగానుండును
త్రాగువారల చెంతఁ | దరలకుండు
వ్యభిచారజనముల | వరుసనె నిలబడు
ననుదోచుచుండును | నామెతీరు
పూర్వజన్మంబులఁ | బూజఁజేసిరిగాన
వారిని వదలెడు | వసతిలేక
ఏవగించుచునుండు | నెపుడెప్పు డోదునా
యనిచిందులేయుచు | నర్థనిమిష

తే॥గీ॥ మొక్కవేఁడుగ నీసతి ౯ యుండలేక
తలఁచుచుండును తత్వంబు ౯ దెలియచేయ
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 48

సీ॥ శుచియన నింటిని ౯ శుద్ధి చేయుట కాదు
చిత్తంబు కలుషంబు ౯ చిమ్మవలయు
గొప్పనబంగారు ౯ గొలుసు లేయుటగాదు
మదికివిజ్ఞానంబు ౯ కుదురవలయు
విద్యనేర్చినమాత్ర ౯ వెలయేది దానిచే
చిత్తశుద్ధియులేక ౯ చెత్తయగును
ద్రవ్యముండినమాత్ర ౯ ధనవంతులందురు
సజ్జనత్వము లేక ౯ చౌకగాదె

తే॥గీ॥ కలిమిలేములు కావయ్య ౯ ఘనుఁడుగాఁగ
ఆత్మతేజస్సు వెలుగంగ ౯ నధికుఁడగును
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 49

సీ॥ ఇంకొక్కసంగతి ౯ నింపుగా వినవయ్య
నీసతిమాయలు ౯ నీకె తెలియు
ఒక్కరాతిరి నేను ౯ నిక్కంబయనుకొంటి
నింటిలోబియ్యంబు ౯ నిండుకొనఁగ

ఎక్కువవాడగా ƒ నింతలోనయిపోయె
పూనుకొందును నింక ƒ పొదుపు సేయ
అనుచు నేనిద్రించ ƒ నంతటఁగన్నట్టి
దృశ్యంబు చెప్పెద ƒ దేవదేవ

తే॥గీ॥ కల్లలాడెదు పడఁతిని ƒ గానువినుము
సంశయంబైన నామెయే ƒ సాక్ష్యమిచ్చు
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంత మేల. 50

సీ॥ గుంపుగుంపుగజనుల్ ƒ గుమ్మాలు దాటుచు
నన్నంబు నడిగిరి ƒ నన్నుఁజూచి
వీరందరికి నేను ƒ నేరీతిఁ బెట్టుదు
నిన్న నే బియ్యంబు ƒ నిండుకొనియె
లేదని చెప్పంగ ƒ రాదు మాటయు నాకు
అనుకొని నేనప్డు ƒ వెనుక దిరుగ
పెద్దగుండిగ వార్చి ƒ పెట్టిన దృశ్యంబు
నాకండ్లకగుపడ ƒ నఁగి నేను

తే॥గీ॥ పైకి నెత్తియు వడ్డింప ƒ పదిలముగను
ఒకఁడెతినెనంత యన్నంబు ƒ నొప్పుగాను
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంత మేల. 51

సీ॥ కలవరపడుచు నే ౯ కండ్లు దిప్పుచుచూడ
మరియొకగుండిగ ౯ సరిగనుండె
అది తెచ్చిపెట్టంగ ౯ నంతయు తినెనయ్య
మరియొక వ్యక్తియే ౯ మందునేను
ఎన్ని గొత్తుచునున్న ౯ నన్ని వారుపులుండె
వారొక్కవ్యక్తికే ౯ వచ్చుచుండె
తెల్లవాయువులు ౯ తిరుగుచునడ్డింప
నలుపుదోచగనొడల్ ౯ పులకరించె

తే॥గీ॥ తెరువచూచియు నాకండ్ల ౯ తెరువజాల
నొక్కిపట్టినలాగున ౯ నొప్పిపుట్టె
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 52

సీ॥ కండ్లుబోయినవంచు ౯ కలవరపడినేను
వ్రేళ్ళతోరెప్పలు ౯ విప్పిలాగ
పిడికొద్దిగచూపు ౯ నీడగానానెను
నన్నుచూచుచునున్న ౯ నాతియొక తె
నాల్గుచేతులుగల్గి ౯ నగుమోముతోనుండి
కనువిప్పినావైపె ౯ గాంచుచుండె
సుదతి నీమనసులో ౯ చుల్కదనంబేల
నేనుండనీయింట ౯ నేమికొదువ

తే॥గీ॥ అనుచు హాస్యముతో చూచు నతివఁగాంచి
సిగ్గుపడితిని నేనప్డు సిరియె యామె
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ పంత మేల.

సీ॥ లక్ష్మితిరుగుచుండె లక్ష్యంబునాకామె
అయినను నేనేమి యడుగలేను
నా పూర్వజన్మాన నాకర్మయనునట్టి
వృక్షంబుఫలములే బిక్షనాకు
యాచించనెరుగని యతివనేననియెంచి
మర్మంబుగానన్ను మాయజేయు
గట్టిమర్యాదను ఘనతగా నేఁజేయ
నడిగినవెల్లను నామెయిచ్చు

తే॥గీ॥ నడుగునబలనుగానని యతివయలిగి
చేరనొకమూల కోపాన నీరజాక్షి
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ పంత మేల.

సీ॥ నేఁజేయగలనేమొ నీభార్యమర్యాద
నాతనువెడలంగఁ జేతురెవరు
అపుడు కోపమువచ్చి యామెతొలఁగనేని
ఇల్లుచూడఁగనంత గుల్లకాదె

ఇపుఁడేమొ వచ్చిన ƒ నింటిలోనందరు
సోమరితనమున ƒ పామరమున
చదువుసంధ్యలురాక ƒ శ్రమపడనెరుగక
సుకుమారులై యుండి ƒ సుఖముమరిగి

తే॥గీ॥ ధర్మమార్గంబు మరచిన ƒ తరుణమందు
లచ్చి వెడలినగతియేమి ƒ బిచ్చగాక
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 55

సీ॥ కష్టార్జితంబౌర ƒ కళయంద్రు భువిలోన
యాచించుధనమది ƒ యధమమంద్రు
నామీదలచ్చికి ƒ ననురాగముండిన
రావచ్చు నికమీద ƒ బోవదేని
మడిగట్టినడిగట్టి ƒ మర్యాదచేయుట
నావల్లగాదని ƒ దేవచెప్పు
పిల్లలుగలయిల్లు ƒ కల్లోలముగనుండు
చిరచిరవలదని ƒ సిరికిఁజెప్పు

తే॥గీ॥ ఇన్నిచిక్కులు నాకేల ƒ యింతినాకు
సర్వసౌభాగ్య కళలీయ ƒ చాలునయ్య
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 56

సీ॥ ఇంకనొక్కటివిను ƒ నిదియు చెప్పెదనీకు
ఒకరాత్రి జరిగిన ƒ యొక్కవింత
భిల్లరూపంబుతో ƒ మెల్లగవచ్చిరి
దంపతులిద్దరు ƒ దయనుజూప
ఎపుడొ చూచినయట్లు ƒ లెదలోనతో చంగ
నిర్ఘాంతపడి నేను ƒ నిలువఁబడితి
చిరునవ్వుతో నున్న ƒ చిగురుబోడిని చూచి
యెంతచక్కనిదాన ƒ వింతినీవు

తే॥గీ॥ పట్టుచీరగట్టి నగల ƒ పెట్టుకొన్న
నెంతయందాననుందువో ƒ నింతియంటి
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 57

సీ॥ అదివిని నవ్వెను ƒ యాతన్వి పతియైన
భిల్లరూపుండప్డు ƒ మెల్లగాను
ఈసారిచూడమ్మ ƒ యీతన్వియందంబు
అనినన్ను చూచుచు ƒ నతఁడుపలికె
తలయెత్తిచూడంగ ƒ దంపతులిద్దరు
వికృతరూపులునౌచు ƒ వింతదోప
ముడుతలుపడియును ƒ ముసలివారైరపై
చూచుచుండగవారి ƒ సొంపుపోవె

తే॥గీ॥ ఏమిచిత్రంబొ యనుచు నే ♩ నెంచిమదిని
బొమ్మలాగుననిలుచుంటి ♩ నమ్మనీవు
రమ్ము రమ్మయ్య మణిమంది ♩ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ♩ పంతమేల. 58

సీ॥ ఆమాయమాపుండొ ♩ యేమాటయనక యా
చేతిలోశూలంబు ♩ చేర్చిపట్టి
యింటిచుట్టుననున్న ♩ యెండుటాకులనన్ని
తుడుచుచు గెంటుచు ♩ తుక్కునంత
నొక చోటచేర్చంగ ♩ నువిదతటాలున
నంట్లగిన్నెలబైట ♩ నపుడువేయ
నోటమాటయురాక ♩ సూటిగాచూచుచు
నెట్టకేలకునంటి ♩ నింతితోడ

తే॥గీ॥ పడతి పని చేయువారుంటె ♩ పదులుమీరు
వచ్చిమాయింట పని చేయ ♩ వలదెయంటి
రమ్ము రమ్మయ్య మణిమంది ♩ రానికనిన
పలుకవేలయ్య పరమాత్మ ♩ పంతమేల. 59

సీ॥ అని నేనునుడువంగ ♩ యాతన్వియపుడు
చిరునవ్వుతోజూచె ♩ చేడెవంక
ముసిముసినవ్వుతో ♩ గుసగుసలాడుచు
నతఁడనెననుగాంచి ♩ యాదరమున

ఓయమ్మనీయింట ƒ నోర్పుతోఁ పనిచేయ
మేమిద్దరుందుము ƒ మీకుఁదోఁడు
నీవుశోఁచినదీయ ƒ మాకదేవాలమ్మ
యనియతఁ డనఁగానె ƒ యతివనవ్వె

తే॥గీ॥ సకలకార్యంబులను జేయు ƒ సఖియయనుచు
మధురభాషలనాడిన ƒ మగువయెవరొ
రమ్మ రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 60

సీ॥ మరునాఁడు నాకంత ƒ మతిబోయినట్లుండె
నిన్నవచ్చిన వార్ల ƒ నిర్ణయింప
కైలాసవాసులే ƒ కాని యన్యులుగారు
పాపమేయని పరి ƒ తాపపడితి
తల్లిదండ్రులసేవ ƒ తెల్లసేయగలేదు
అత్తమామలసేవ ƒ యసలె లేదు
పట్టుగా చెప్పంగ ƒ పతిసేవగూడను
గట్టిగ చేసిన ƒ కాంతగాను

తే॥గీ॥ అట్టిపడఁతిని దేవతల్ ƒ గట్టిబుణము
నెట్లుదీర్చెద! యో దేవ ƒ యెంచిచెపుమ
రమ్మ రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 61

| పేజీ | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 10 | చెతవైచి | చేతవైచి |
| 12 | జకర్చిజెప్పి | జెర్చిచెప్పి |
| 19 | నా తంత్రి | నాతండ్రి |
| 24 | నవారగా | నవారిగా |
| 28 | ఎట్లు | ఎట్టు |
| 28 | ఘనుడపు | ఘనుడవు |
| 31 | గూత్రించు | గూంత్రించు |
| 35 | నేనేంత | నేనెంత |
| 37 | చూవులే | రూపురే |
| 53 | యుడుంసు | యుండును |
| 54 | అయహంకారం | అయహంకారం |
| 55 | నిదురపై | నిదురప్డై |
| 58 | నగినెను | నరిగినేను |
| 67 | కష్టంటు | కష్టంబు |
| 75 | పరువులెవె | పరువులేవె |

# మణియమ్మగారి గ్రంథములు

| | | |
|---|---|---|
| సమ్మోహ సందేశము | ద్విపద | 0—3—0 |
| నివేదిక | పద్యరచన | 0—2—0 |
| మణి భావమణులు | పద్యకావ్యము | 0—8—0 |
| మణి మందిరము | పద్యకావ్యము | 1—0—0 |
| ,, క్యాలికోబైండు | ,, | 1—8—0 |

రాబోవు గ్రంథము— మణిమాలలు


అడ్రస్సు :

యస్. మణిరామచంద్రరావుగారు

గూడూరు నెల్లూరుజిల్లా

లేక

T. వీరభద్రరావుగారు, V. M. రాజమండ్రి.